# రుద్రాక్షాది మాలలు - ఫలములు

రచయిత

శ్రీ బవ్వారి సుబ్రహ్మణ్యశర్మ

ప్రకాశకులు

శ్రీ హనుమత్సేవా సమితి

ముదిగంటివారివీధి, సత్యనారాయణపురం,

విజయవాడ — 520 011

రక్తాక్షి - వైశాఖము
శ్రీ హనుమజ్జయంతి — 20-5-1984
ప్రతులు 1000

వెల - రు 5/-

ప్లాక్స్ : శ్రీ లక్ష్మి ఎంటర్ ప్రైజస్
ఏలూరు రోడ్ విజయవాడ - 520 002.

ముద్రణ :
వికాస్ ప్రింట్
స్వామివీధి, గాంధీనగరం,
విజయవాడ - 520 003

# విషయ సూచిక

శ్రీరస్తు

# శ్రీ రుద్రాక్షాదిమాలలు-ఫలములు

"లంబోదరం పరమసుందర మేకదంతం
రక్తాంత దీప్తినయనం పరమం పవిత్రమ్ ।
ఉద్యద్దివాకరకరోజ్వలకాంతికాంతం
విఘ్నేశ్వరం సకలవిఘ్నహరం నమామి ॥"
"ఓంనమో వేంకటేశాయ పురుషాయ మహాత్మనే
ప్రణతః క్లేశనాశాయ గోవిందాయ నమోనమః"
"అకారాదిక్షకారాంతవర్ణజాతకళేబరం ।
వికళేబరకైవల్యం రామచంద్రపదం భజే ॥"

వావిళ్ళవారు ప్రచురించిన అష్టోత్తర శతోపనిషత్తుల లోని "యజుర్వేదీయ యో॥ పనిషత్తు"ను చదువుటకు శాంతి పాఠమును పఠించి —

"ఓమ్ సర్వేజీవా సుఖైర్దుఃఖైర్మాయాజాలేన వేష్టితాః తేషాం ముక్తిః కథం దేవ కృపయా వద శంకర, సర్వసిద్ధికరం మార్గం మాయాజాలానికృంతనమ్, జన్మ మృత్యు జరా వ్యాధి నాశనం సుఖదం వద ఇతి హిరణ్యగర్భః ప్రపచ్ఛ సహోవాచ మహేశ్వరః —"

అని చదువుచుండగ నింతలో "గురువుగారు! గురువుగారూ!" అని పిలుచుచు నొక్క యజ్ఞాత శిష్యుడు ప్రత్యక్షమై నమస్కరించి కూరుచుండి గురువుగారు! మీతో మాటలాడ

టకు వచ్చితిని; సందేహములు తీర్చుకొనవలెను మీ రీ వేదాంత
గ్రంథమును కొంతతడవు వ్రాసి, నా సంశయములను దీర్చుడని
యడుగుచు - మీరు చదువుచున్నది వేదాంతోపనిషత్తగునా ?
ఇంతవఱకు నర్థమును వినుపించుడనియు నడిగినాడు గురువు
వచ్చినవానిని పరీక్షగా చూచినాడు ఈయన నిజముగా తెలిసి
కొనవలెనను యిచ్ఛతో వచ్చినట్టులు కనుపించుచున్నాడు
ఏయుబ్బది నలువది సంవత్సరము లుండవచ్చును ధోవతి కట్టికొని
ఉత్తరీయమును కప్పుకొనినాడు ముఖమున భస్మరేఖలు
మెఱయుచున్నది నుదుట రక్తతిలకము కలదు కంఠమున
రుద్రాక్షమాల శోభించుచున్నది "గ్రావు" యున్నను దనిమధ్య
స్వల్పముగా ఖయును వెక్కిరించుచున్నట్టులు కన్పించు
చున్నది ఈరూపునసుండిన నా యువకునిపులల నింకొక్క
మారు పాదాదిశిఖపర్యంతమును చూచినాడు అడిగినవాని
యిచ్ఛను కాదనలేక, కాలవిడంబనమునకు జంకక సమాధా
నము లిచ్చుట కుపక్రమించినాడు

గురువు - శిష్యుడా ! నీకు శుభము కలుగుగాక; నే
నిప్పుడు చదువుచున్నది "యోగశిఖోపనిషత్తు" బ్రహ్మదేవుడు
సదాశివునివద్దకుం జేరి, నమస్కరించి "మహాదేవా !" జీవులెల్ల
రును సుఖదుఃఖము లనుభవించుచు మాయయను వలయందు
చిక్కువడిరి అట్టి జీవులు తరించుటకు మార్గము కలదా !
ఉన్నచో దయయుంచి మాయాజాలనికృంతనమునకును జన్మ
మృత్యుజరావ్యాధులు నశించుటకును, సర్వసిద్ధికరమైనట్టియు
సుఖప్రదమైనట్టిదియు నగు మార్గము నుపదేశించుమని బ్రహ్మం

జటుడై యర్థించినాడు ఈమాటలకు శివుడు సమాధానము చెప్ప మొదలిడినాడు ఇంతవరకు నేను చదివితిని ఇంతలో నీవు వచ్చితివి ఇంక సందేహములను వినుపించుము

అ శి - గురువుగారు! వేదాంతమున ఉపనిషత్తులుండి నటుల రుద్రాక్షలకు, తులసీపూసలకు నుపనిషత్తులు కలవా? ఉన్నయెడల నాయావ్యాసలు ధరించువిధానములను, వాటి ఫలములను చెప్పుచు ఏ మాలలను పురుషులు ధరింపవలెను స్త్రీలు యేమాలలు ధరించవలెను? ఒక్కొక్కపూసకును ప్రత్యేకములుగా ఫలితము యుండునా! ఈ నా సందేహములను తగిన రీతిగ నాకు తెలియునటుల వివరములుగా చెప్ప ప్రార్థనము

నా స - అజ్ఞాతశిష్యుడా! వినుము ఎంతచక్కగా నడిగితివయ్యా! వినుము నీ వడిగిన వాటికి యుపనిషత్తులు కలవు "అక్షమాలికోపనిషత్తు రుద్రాక్షోపనిషత్తులు అనునవి కలవు ఇవిగాక పురాణములందును నీటివివరణములు లవు ము ముందుగ పూసలభేదములను వినుము

మున్నొక్కనాడు గుహుడు అనంబడు కుమారస్వామి బ్రహ్మవద్దకుజని, నమస్కరించి "తాతా! బ్రహ్మదేవా! అక్షము అనంబడు పూసలభేదములను విధులను చెప్పుమని యర్థించినాడు. వారి సంవాదమంతయు నక్షమాలికోపనిషత్తునందు కలదు. దానిని వినుము

## పూసల ప్రత్యేక గుణములు

"అథ ప్రజాపతిర్గుహం పప్రచ్ఛ భో బ్రహ్మ న్నక్ష మాలాభేద విధిం బ్రూహీతి. సా కింలక్షణా, కతిభేదా, అస్యా!

కానిసూత్రాణి, కథం ఘటనా ప్రకారః, కే వర్ణాః కా ప్రతిష్ఠా, కైషాధిదేవతా, కింఫలంచేతి, తం బ్రహ్మా ప్రత్యువాచ,"

(పూర్వమర్యాదలన్నియునైన తరువాత) ప్రజాపతిని కుమారస్వామి యిట్లు అడిగినాడు ఓబ్రహ్మా! అక్షమాలందలి భేదములను విధులను తెలుపుము అక్షములలక్షణములు భేదము లెట్లుండును ? వాటికి సూత్రము లెవ్వి గుచ్ఛవిధానము లెట్టివి ? ఏ సూత్రములు పనికివచ్చును ? వాటి రంగు లెట్టివి ? ఏవిధముగ ధరించ (ప్రతిష్ఠించ)వలెను ? అధ్యాసల కధిష్ఠాన దేవత లెవ్వరు ? ఏఫల మొనగూడును అని పలువిధములుగ ప్రశ్నించిన గుహునకు విధాతయీరీతిగ సమాధానము లొసంగినాడు

"ప్రవాళ మౌక్తిక స్ఫటిక శంఖరజతాష్టాపద చందన పుత్రజీవ కాష్ఠ రుద్రాక్ష ఇతి ఆదిక్షాంతమూర్తి సావధానభావా సౌవర్ణం రాజతం తామ్రం చేతి సూత్రత్రయమ్, తద్వివరే సౌవర్ణం తద్దక్షపార్శ్వే రాజతం తద్వామే తామ్రం, తన్ముఖే ముఖం, తత్పుచ్ఛే పుచ్ఛం తదంతరావర్తనక్రమేణ యోజయేత్"

ప్రవాళ (పగడ)ములు, ముత్యములు, స్ఫటికములు, శంఖములు, వెండిపూసలు, గంధపుపూసలు, తామరపూసలు, పద్మపుపూసలు, రుద్రాక్షలు, ఇవి మాలలకు పనికివచ్చును ఈ పూసలను బంగారు, వెండి, రాగితీగలతో గ్రుచ్చవచ్చును అకారాదిక్షకారాంతముగ మూర్తులభేదములు కలవు, సావధాన భావముతో సువర్ణ రజిత తామ్రతీగెలను పూసలకు సూత్రములుగ చేసికొనవచ్చును, పూసలందు ముఖమును ముఖముతోను, పుచ్ఛము (తోక)ను పుచ్ఛముతోను కలిపి గ్రుచ్చ

వలయును అదుఁదరవ ర్తనమును క్రమముగ యోచింప వలయును

"యదస్యాంతరం సూత్రం తద్బ్రహ్మ, యద్దక్షపార్శ్వే తచ్ఛైవం, యద్వామే తద్వైష్ణవం, యన్ముఖం సా సరస్వతీ యత్పుచ్ఛం సా గాయత్రీ యత్సుషిరం సావిద్యా, యాగ్రంధిస్సా ప్రకృతిః, యేస్వరాస్తే ధవళాః, యేస్వర్ణాస్తే పీతా యేవర్ణాస్తే రక్తాః అథ తాం పంచశిరంకై రమృతైః పంచ [illegible] స్తనుగ్రాహయిత్వా పంచ [illegible] గంధోదకేనః సంప్రాప్య తస్మాల్లోకం [illegible] త్ర [illegible] న్నవయిత్వా [illegible] రాలిప్య [illegible] రారాధ్య ప్రత్యక్ష [illegible] పూదిశం [illegible]

ఏది (పూసకు) అంతరమునందు సూత్రమట్లో ఆసూత్రము (బ్రహ్మము) ప్రకృతి కంఠలీనమై సూత్రరూపముగా నుండి నదియో బ్రహ్మము ఏది (పూసకు) దక్షిణభాగమో అయ్యది శైవము (బ్రహ్మమునకు కుడిపార్శ్వము శైవము ఏది (పూసకు) వామభాగమో అయ్యది వైష్ణవము బ్రహ్మమునకు వామభాగము వైష్ణవము ఎయ్యది ముఖమో అయ్యది సరస్వతి (బ్రహ్మ ముఖము సరస్వతీ నిలయము) ఏది పుచ్ఛము (తోక లేక అడుగుభాగము)గా నుండెనో అయ్యది గాయత్రి (శబ్దము సరస్వతి నాదము గాయత్రి) ఏది సమ్మేళ మొనరించెనో అయ్యది విద్య (శబ్దనాదముల కలయిక ప్రణవము) ఏది గ్రంధి (ముడి)యో అయ్యది ప్రకృతి (విడదీయరాని అజ్ఞానమే ప్రకృతి రెండుగా చేయుటకు వీలుగాని పూసయే

ప్రకృతి ఇదియే (గ్రంధి) ఏది స్వరము (సత్వగుణము)గ
నుండెనో అది తెలుపువర్ణము ఏది స్పర్శము [రజో గుణ
తమో గుణము లేకనై యేక గుణముగా నుండెనో అద్వ్యది
శీతము] [ఎరుపు నలుపులు కలసినది ఆకుపచ్చ వర్ణము]
ఏది ఎర్రనైనదో అద్వ్యది రక్తము [రజో గుణము,] సత్వరజ
స్తమో గుణములు మూడును అ-ఉ-మ కారము లేకనై
ప్రణవముగా మారిన విధముగ. తెలుపు యెరుపు నలుపు
లుండిన పూసలును, ప్రత్యేకముగా నుండిన పూసలును | ఇట్టి
మణులనంబడు పూసలను పంచగవ్యము చేతను గంధోద
ముల చేతను చక్కగా నభిషేచనము గావించి, పంచగవ్య
ముల తోడను, పాలచేతను శోధన మొనరించి తరువాత
నోంకారమును జపించుచు నొక ఉరుమీద నుంచి స్నానము
చేయించి, గంధ పుష్పాక్షతలతో బూజించి, శుచి స్థలమునం
దుంచి, అకారము మొదలుగ క్ష కారాంతము వరకు వచ్చెడి
తొలి అక్షరముల నుచ్చరించుచు నాయా దేవత లాయక్షరము
లందు సుప్రతిష్ఠులై యుందురుగాక అని ప్రార్థించవలెను
[భావించవలెను]

## మణుల ప్రాధాన్యతలు

"ఓం అంకార మృత్యుంజయ సర్వవ్యాపక ప్రథమేఽక్షే
ప్రతిష్ఠ ఓం ఆంకార ఆకర్షణాత్మక సర్వగత ద్వితీయేఽక్షే
ప్రతిష్ఠ ఓం ఇంకార పుష్టిదా క్షోభకర తృతీయేఽక్షే ప్రతిష్ఠ
ఓం ఈంకార వాక్ప్రసాదకర నిర్మల చతుర్థేఽక్షే ప్రతిష్ఠ

ఓం ఊంకార సర్వబలప్రద సారతర పంచమేఽక్షే ప్రతిష్ఠ ఓం ఉంకార ఉచ్చాటనకర దుస్సహ షష్ఠేక్షే ప్రతిష్ఠ ఓం ఋంకార సంక్షోభకర చంచల సప్తమేక్షే ప్రతిష్ఠ ఓం ౠంకార సంమోహనకర ఉజ్వల అష్టమేఽక్షే ప్రతిష్ఠ ఓం ఌంకార విద్వేషణకర మోహక నవమేఽక్షే ప్రతిష్ఠ ఓం ౡంకార మోహకర దశమేఽక్షే ప్రతిష్ఠ ఓం ఏంకార సర్వవశకర శుద్ధసత్వ ఏకాదశేఽక్షే ప్రతిష్ఠ ఓం ఐంకార శుద్ధసాత్విక పురుషవశ్యకర ద్వాదశేఽక్షే ప్రతిష్ఠ ఓం ఓంకార అఖిలవాఙ్మయ నిత్యశుద్ధ త్రయోదశేఽక్షే ప్రతిష్ఠ ఓం ఔంకార సర్వవాఙ్మయ వశ్యకర చతుర్దశేఽక్షే ప్రతిష్ఠ, ఓం అంకార గజాది వశ్యకర మోహన పంచదశేఽక్షే ప్రతిష్ఠ, ఓం అఃకార మృత్యు నాశకర రౌద్ర షోడశేఽక్షే ప్రతిష్ఠ

౧ మృత్యువును జయించునట్టిది సర్వవ్యాప్తక మైనట్టిదియు ప్రణవముతో గూడిన "అం" కారము యీ మొదటిశ్వాసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౨ ఆకర్షణాత్మక మైనట్టిది సర్వత్ర నిండి యుండునట్టిదియు ప్రణవముతో గూడిన "ఆం" కారము యీ రెండవ శ్వాసయందు ప్రతిష్ఠితమై నిలుచుగాక

౩ పుష్టి[బలము]నిచ్చునది, క్షోభ[వేదన]కలిగించునట్టిదియు ప్రణవముతో గూడిన "ఇం" కారము యీ మూడవశ్వాసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౪ వాక్కునకు ప్రసాదగుణమిచ్చునట్టిది, నిర్మలమైనట్టిదియు ప్రణవముతో చేరిన "ఈం"కారము యీ నాలుగవ శ్వాసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౫ అన్ని బలముల కాధారమైనట్టిది, పాపములను నాశకమైనట్టిదియు ప్రణవముతో చేరిన "ఉం"కారము యీ ఐదవ శ్వాసమందు స్థిరమై యుండుగాక

౬ ఉచ్చాటనమున కాధారమైనట్టిది ఉష్ణమైనట్టిదియు ప్రణవముతో గూడిన "ఊం"కారము యీ ఆరవ శ్వాసయందు ప్రతిష్ఠితమై నిలిచియుండు గాక.

౭ సంక్షోభమును కలిగించునట్టిది, చంచలమైనట్టియు ప్రణవముతో గూడిన "ఋం కారము యీ యేడవ శ్వాసయందు ప్రతిష్ఠితమై నిలిచియుండు గాక

౮. సమ్మోహన [మోహము] కరమైనట్టిది, ఉజ్వల [మహా తేజము] మైనట్టిదియు ప్రణవముతో గూడిన "ౠం"కారము యీ యెనిమిదవ శ్వాసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౯ విద్వేషణకరమై [ద్వేషమును కలిగించు] నట్టిది, మోహము కలిగించునట్టిదియు ప్రణవముతో చేరిన "ఌం"కారము యీ తొమ్మిదవ శ్వాసయందు ప్రతిష్ఠితమై యుండుగాక.

౧౦ మోహకరమై (మోహమును కలిగించునట్టి) ప్రణవముతో గూడిన "ౡ"కారము యీ పదియవ శ్వాసయందు ప్రతిష్ఠితమై నిలచియుండు గాక

౧౧ సర్వము (స్త్రీ పురుషాదులను) వశ్యమొనరించునట్టిది. శుద్ధమైనట్టిదియు ప్రణవముతో గూడిన "ఏం"కారము యీ పదునొకండవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౧౨ శుద్ధసత్త్వము (అతిశాంతము. తేజముగా గలవి) కలది పురుష వశీకరణమైనట్టిదియు ప్రణవముతో జేరిన "ఐం"కారము యీ పదిరెండవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౧౩ అఖిల వాఙ్మయునకు స్వరూప (ఆధార) ముగా కలది, నిర్మలమైనట్టిదియు. ప్రణవముతో జేరిన "ఓం"కారము యీ పదుమూడవ పూసయందు ప్రతిష్ఠితమై నిలిచియుండు గాక

౧౪ సర్వ వాఙ్మయమును రూపముగా కలిగినట్టిది, వశ్యకరమైనట్టిదియు ప్రణవముతో గూడిన "ఔం"కారము యీ పదునాలుగవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౧౫ గజాది జంతుజాలమును వశీకర మొనరించునట్టిది. మోహమును పుట్టించునట్టిదియు ప్రణవముతో జేరిన "అం"కారము ఈ పదునైదవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౧౬ మృత్యువును నశింపజేయునది. రౌద్రమును కలిగించునట్టిదియు ప్రణవముతోగూడిన "అః" కారము యీ పదునారవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

"ఓం కంకార సర్వవిషహర కల్యాణద సప్తదశేఽక్షే ప్రతితిష్ఠ. ఓం ఖంకార సర్వసంక్షోభకర వ్యాపకాష్టాదశేఽక్షే ప్రతితిష్ఠ. ఓం గంకార సర్వవిఘ్నశమన మహత్తర ఏకోనవింశేఽక్షే ప్రతితిష్ఠ. ఓం ఘంకార సౌభాగ్యద స్తంభనకర వింశేఽక్షే ప్రతి

తిష్ఠ, ఓం ఒంకార సర్వవిఘ్ననాశకర ఉగ్ర ఏకవింశేఽక్షే ప్రతిష్ఠ, ఓం చంకార అభిచారఘ్నక్రూర ద్వావింశేఽక్షే ప్రతిష్ఠ ఓం ఛంకార భూతనాశకర భీషణ త్రయోవింశేఽక్షే ప్రతిష్ఠ ఓం జంకార కృత్యాదినాశకర దుర్ధర్ష చతుర్వింశేఽక్షే ప్రతిష్ఠ, ఓం ఝంకార భూతనాశకర పంచవింశేఽక్షే ప్రతిష్ఠ ఓం ఞంకార మృత్యుప్రమథన షడ్వింశేఽక్షే ప్రతిష్ఠ ”

౧౭ అన్నివిధములైన విషములను హరించునట్టిది, అన్ని శుభ (కల్యాణ)ములను చేయునట్టిదియు ప్రణవముతో జేరిన "కం" కారము యీ పదునేడవ పూసయందు ప్రతిష్ఠతమై యుండుగాక

౧౮ అంతటిని క్షోభపఱచునట్టిది, అంతటను వ్యాపకమై యుండునట్టిదియు, ప్రణవముతో జేరిన "ఖం" కారము యీ పదునెనిమిదవ పూసయందు ప్రతిష్ఠతమై యుండుగాక

౧౯ సర్వవిఘ్నములను పోగొట్టునట్టిది, మహత్తర(గొప్పదై)మైనట్టిదియు ప్రణవముతో గూడిన "గం" కారము యీ పందొమ్మిదవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక.

౨౦ సౌభాగ్య (ఐశ్వర్యము, జ్ఞానము)మొసంగునట్టిది, స్తంభనమొనరించునట్టిదియు, ప్రణవముతో జేరిన "ఘం" కారము యీ యిరువదవపూసలో ప్రతిష్ఠితమై యుండుగాక

౨౧ సర్వవిషములను హరించునట్టిది, ఉగ్ర(అతిభీషణ)మైనట్టిదియు "ఙం" కారము యీ యిరువదొక్కటవ పూసయందు ప్రతిష్ఠితమై నిలిచియుండుగాక

౨౨ అభిచార(చంపునట్టి ప్రయోగ)మును నశింపచేయునట్టిది, క్రూర (భయంకర)మైనట్టిదియు ప్రణవముతో గూడిన "చం"

కారము యీ యిరువదిరెండవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౨౩ భూత (పిశాచముల) బాధలను పోగొట్టునట్టిది, భయంకరమైనట్టిదియు ప్రణవముతోగూడిన "ఛంకారము" యీ యిరువదిమూడవపూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౨౪ పిశాచ ప్రయోగాది కృత్యములను నాశముకావించునట్టిది ప్రచండ (మహాభయంకర) మైనట్టిదియు ప్రణవముతోగూడిన "జం" కారము యీ యిరువదినాలుగవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౨౫ భూత (పిశాచ) నాశనకరమైనట్టి "ఝం" కారము యీ ఇరువదైదవపూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౨౬ మృత్యువును నశింపజేయునట్టిదైన "ఞం" కారము యీ యిరువదియారవపూసలో ప్రతిష్ఠిత మగుగాక

"ఓం టంకార సర్వవ్యాధిహర సుభగ సప్తవింశేఒక్షే ప్రతితిష్ఠ, ఓం ఠంకార చంద్రరూప అష్టావింశేఒక్షే ప్రతితిష్ఠ, ఓం డంకార గరుడాత్మకవిషఘ్న శోభన ఏకోనత్రింశేక్షే ప్రతితిష్ఠ ఓం ఢంకార సర్వసంపత్ప్రద సుభగ త్రింశేఒక్షే ప్రతితిష్ఠ, ఓం ణంకార సర్వసిద్ధిప్రద మోహకర ఏకత్రింశేఒక్షే ప్రతితిష్ఠ, ఓం తంకార ధనధాన్యాదిసంపత్ప్రద ప్రసన్న ద్వాత్రింశేఒక్షే ప్రతితిష్ఠ ఓం థంకార ధర్మప్రాప్తికర నిర్మల త్రయస్త్రింశేఒక్షే ప్రతితిష్ఠ, ఓం దంకార పుష్టి వృద్ధికర ప్రియదర్శన చతుస్త్రింశేఒక్షే ప్రతితిష్ఠ, ఓం ధంకార విషజ్వరఘ్న విపుల పంచత్రింశేఒక్షే ప్రతితిష్ఠ, ఓం నంకార భుక్తిముక్తిప్రద శాంత షట్త్రింశేఒక్షే ప్రతితిష్ఠ, ఓం పంకార విషవిఘ్న నాశన భవ్య సప్తత్రింశేఒక్షే ప్రతి

తిష్ఠ. ఓం ఝంకార అణిమాదిసిద్ధిప్రదజ్యోతిరూపాష్టత్రింశేఽష్ట ప్రతి
ష్ఠ. ఓం ఞంకార సర్వదోషహర శోభన ఏకోనచత్వారింశేఽష్ట
ప్రతిష్ఠ ఓం టంకార భూతశాంతికర భయానకచత్వారింశేఽష్ట
ప్రతిష్ఠ ఓం ఠంకార విద్వేషిమోహనకర ఏకచత్వారింశేఽష్ట
ప్రతిష్ఠ"

౨౭ సర్వవ్యాధులను వశింపజేయునట్టిది, శుభము (మేలు, ఉపకారము)చేయునట్టిదియు ప్రణవముతో గూడిన "టం" కారము యీ యిరువదియేడవపూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౨౮ చంద్రునితో సమానమైన రూపముకలదియు ప్రణవముతో జేరిన "ఠం" కారము యీ యిరువదియెనిమిదవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౨౯ గరుడాత్మకమై విషమును హరించునట్టిది, శుభప్రదమైనట్టిదియు ప్రణవముతో జేరిన "డం" కారము యీ యిరువది తొమ్మిదవపూసయందు ప్రతిష్ఠితమైయుండుగాక

౩౦ సర్వసంపత్తు లొసంగునట్టిది, సుభగ (శుభస్కార)మైనట్టిదియు ప్రణవముతో జేరిన "ఢం" కారము యీ ముప్పదవపూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౩౧ సర్వసిద్ధుల నిచ్చునట్టిది, మోహ(అపేక్ష) కరమైనట్టిదియు ప్రణవముతో గూడిన "ణం" కారము యీ ముప్పది యొకటవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక.

౩౨ ధనధాన్యాది సంపత్ప్రదమైనట్టిది, ప్రసన్నకరమైనట్టిదియు ప్రణవముతో జేరిన "తం" కారము యీ ముప్పదిరెండవపూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక.

౩౩ ధర్మప్రాప్తకరమైనట్టిది, నిర్మలమైనట్టిదియు ప్రణవముతో గూడిన "థం" కారము యీ ముప్పదిమూడవపూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౩౪ పుష్టిని, వృద్ధిని కలిగించునట్టిది, ప్రియ (ముఖ్యమైనవారి) దర్శనము కలిగించునట్టిదియు ప్రణవముతో గూడినట్టి "దం" కారము యీ ముప్పదినాలుగవపూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౩౫ విషజ్వరము(లను) నశింపజేయునట్టిది, విపుల (విస్తార) మైనట్టిదియు ప్రణవముతో జేరిన "ధం" కారము యీ ముప్పదియైదవపూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౩౬ భుక్తిముక్తు(ఉభయలోకములందును సుఖము) లొసంగునట్టిది, శాంతమైనట్టిదియు ప్రణవముతో గూడియుండిన "నం" కారము యీ ముప్పదియారవపూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౩౭ విషములను, విఘ్నములను హరించునట్టిది, భవ్య(మంగళ ప్రద)మైనట్టిదియు ప్రణవముతో జేరిన "పం" కారము యీ ముప్పదియేడవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౩౮ అణిమాద్యష్టసిద్ధు లొసంగునట్టిది, సిద్ధిప్రదమైనట్టిది, జ్యోతిరూప (ప్రణవతేజ) మైనట్టిదియు ప్రణవముతో గూడినట్టి "ఫ" కారము యీముప్పదియెనిమిదవపూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౩౯. సర్వదోషములను హరించునట్టిది, శుభప్రదమైనట్టిదియు ప్రణవముతోగూడిన "బం"కారము యీ ముప్పది తొమ్మిదవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౪౦. భూతముల (పంచభూతములను, క్షుద్రభూతములను) శాంతింపజేయునట్టిది భయంకరమైనట్టిదియు ప్రణవముతో జేరిన "భం"కారము ఈ నలుబదవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౪౧. ద్వేషి (శత్రువులను) వారిని మోహింపజేయునట్టిదియు ప్రణవముతోగూడినట్టి "మం"కారము ఈ నలుబదొకటవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

"ఓం యంకార సర్వవ్యాపక పావన ద్విచత్వారింశేఽక్షే ప్రతితిష్ఠ ఓం రంకార దాహకర వికృత త్రిచత్వారింశేఽక్షే ప్రతితిష్ఠ ఓం లంకార విశ్వంభర భాసుర చతుశ్చత్వారింశేఽక్షే ప్రతితిష్ఠ, ఓం వంకార సర్వాప్యాయనకరనిర్మల పంచచత్వారింశేఽక్షే ప్రతితిష్ఠ, ఓం శంకార సర్వఫలప్రద పవిత్ర షట్చత్వారింశేఽక్షే ప్రతితిష్ఠ, ఓం షంకార ధర్మార్థకామద ధవళ సప్తచత్వారింశేఽక్షే ప్రతితిష్ఠ, ఓం సంకార సర్వకారణ సార్వవర్ణిక అష్టచత్వారింశేఽక్షే ప్రతితిష్ఠ ఓం హంకార సర్వవాఙ్మయ నిర్మల ఏకోనపంచదశేఽక్షే ప్రతితిష్ఠ, ఓం ళంకార సర్వశక్తి ప్రధాన పంచదశేఽక్షే ప్రతితిష్ఠ, ఓం క్షంకార పరాపరతత్వ జ్ఞాపక పరంజ్యోతీరూప శిఖామణే ప్రతితిష్ఠ"

౪౨. సర్వవ్యాపకత్వము కలిగినట్టిది, పవిత్రమైనట్టిదియు ప్రణవముతో జేరిన "యం"కారము ఈ నలుబదిరెండవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౪౩ దాహక (అగ్ని) శక్తి కలిగినట్టిది, వికృతమయినట్టిదియు ప్రణవముతోగూడిన "రం" కారము ఈ నలువదిమూడవపూస యందు ప్రతిష్ఠితమయి యుండుగాక

౪౪ చరాచరవిశ్వమంతటిని ధరించునట్టిది, ప్రకాశించునట్టిదియు ప్రణవముతోగూడిన "లం" కారము ఈ నలువది నాలుగవ పూసయందు ప్రతిష్ఠితమయి యుండుగాక

౪౫ అన్నిటియందును తృప్తిని కలిగించునట్టిది, నిర్మలమైనట్టిదియు ప్రణవముతోగూడిన "వం" కారము ఈ నలువదైదవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౪౬ సర్వమును ఫలప్రద (సుఖ మొనరించునట్టిది, పవిత్రమయినట్టిదియు ప్రణవముతోజేరిన "శం" కారము ఈ నలువదాఅవపూసయందు ప్రతిష్ఠితమయి యుండుగాక

౪౭ ధర్మార్థకామముల నొసంగునట్టిది, ధవళ (శుద్ధమైన తెలుపు) మయినట్టిదియు ప్రణవముతోగూడిన "షం" కారము ఈ నలువదేడవపూసయందు ప్రతిష్ఠితమయి యుండుగాక

౪౮ సర్వమునకు గారణమయినట్టిది, అన్ని వర్ణము (అక్షరము) లకు సంబంధించినట్టిదియు ప్రణవముతోజేరిన "సం" కారము ఈ నలువదెనిమిదవపూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

౪౯ సర్వవాఙ్మయస్వరూపమయినట్టిది, నిర్మలమయినట్టిదియు ప్రణవముతోజేరిన "హం" కారము ఈ నలువదితొమ్మిదవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక

ుం సర్వశక్తుల రొసంగునట్టిది, ప్రధాన (అన్నిటికిని) మయి నట్టిదియు, ప్రణవముతోగూడిన "శం" కారము ఈ యేబదవ పూసయందు ప్రతిష్ఠితమై యుండుగాక.

పరావర (ఇహలోక పరలోకములు, స్వర్గనరకములు, పుణ్యపాపములు, సుఖదు ఖములు, ధర్మాధర్మములు మున్నగు) తత్త్వములను జ్ఞాపక (విచార) మొనరించునట్టిది, పరంజ్యోతి (ప్రణవరూపము,పరబ్రహ్మము, హృదయపద్మకోశమున వెలుగు జ్యోతిరూపము భ్రూమధ్యమందు ప్రకాశము) రూపము యినట్టి దియు ప్రణవముతో గూడినట్టిదియు "షం"కారము ఈ శిఖామణి (మాలను కొలికిపూస దీనిని మేరువనియు నందురు) యందు ప్రతిష్ఠితమయి యుండుగాక

ఇవ్విధమున నేబదినాలుగక్షరములం దేబది యక్షరములు వచ్చినవి వీనియందు "హ్, క్ష్, ఎ ఔ" యనునవి రాలేదు ఏబదినాలుగుపూసల మాలకు నాలుగు తక్కువ అందులకు పెద్దలిట్లులనిరి. "అ-క-చ-ట-త-ప-య-శ"లను వర్గాక్షరము లందు మొదటి నాలుగింటిని యేబదినాలుగు పూసల మాలకు ప్రణవమునుచేర్చి - అనగా "51, 52, 53, 54" సంఖ్యలు కల పూసలకు "ఓం అం"ను 51 గను, "ఓం కం"ను 52 గను, "ఓం చం"ను 53గను, "ఓం టం"ను 54గను చదువుచు సూత్రమునందు మణులను నంధించవలెను ఇదే విధముగ నూటయెనిమిదిమణులు (పూసలు)గల మాలయందును యేబది తరువాత "51, 52, 53, 54, 55, 56, 57, 58" సంఖ్యల పూసలకు "ఓం అం"ను 51 గను, "ఓం కం"ను 52గను,

"ఓం చం"ను 53గను, "ఓంటం"ను 54గను, "ఓంతం"ను 55గను. "ఓం పం"ను 56గను. "ఓం యం"ను 5 గను, "ఓంశం"ను 58గను పఠించుచూ పూసలను దారము(సూత్రము) నందు చేర్చవలయును ఏబదియెనిమిది యైనతరువాత "58" నుండి పూసను సంధించుటకు దిగువనుండి — అనగా "శం" కారమునుండి "అం"కారము వఱకు బఠించుచు మణులను సూత్రమునందు గ్రుచ్చవలయును పైనుండి దిగువకు దిగువ నుండి పైకిని పఠించుట "అనులోమవిలోమ" మనంబడును ఇట్లులాచరించిన పిమ్మట కిరువైపులం "ఓంఅం" వచ్చును ఇట్లు ప్రథమున పూసలను దానియందు గుచ్చినతరువాత "59" నుండి "108" వఱకు సంధించి, ఆపైన మేరువనంబడు శిఖామణియందు "క్షం"కారమణులయం దిరువైపులయందుండిన సూత్రములను కలిపి, అంతరమునందు ముడివేసి బంధించవల యును ఏబదినాలుగుపూసల మాలకైనను, తదితరమాలల కైనను మేరువువిషయ మిట్లులుండును

ఈరీతిగ పూసలను దారమునందు చేర్చినమీదట, మణుల యీక్రిందివిధముగ దైవములను ధ్యానించవలయును

"అథోవాచ యేదేవాః పృధివీషద స్తేభ్యోనమో భగ వంతోఽనుమదంతే శోభాయై పితరోనుమదంతు శోభాయై జ్ఞాన మయీమక్షమాలికామ్ అథోవాచ, యేదేవా అంతరిక్ష సద స్తేభ్య ఓం నమో భగవంతోఽనుమదంతు శోభాయై పితరోఽనుమదంతు, శోభాయై జ్ఞానమయీమక్షమాలికామ్ అథోవాచ, యేదేవా దివిషద స్తేభ్యో నమోభగవంతోఽనుమదంతు శోభాయై పితరోఽ నుమదంతు, శోభాయై జ్ఞానమయీ మక్షమాలికామ్ అథోవాచ

యే మంత్రా యావిద్యా స్తేభ్యో నమస్తాభ్యశ్చ ఓం నమ స్తచ్ఛక్తి రస్యాః ప్రతిష్ఠాపయతి అథోవాచ, యే బ్రహ్మవిష్ణురుద్రా స్తేభ్య స్సగుణేభ్య ఓం నమ స్తద్వీర్యమస్యాః ప్రతిష్ఠాపయతి అథోవాచ, యే బ్రహ్మవిష్ణురుద్రా స్తేభ్యస్సగుణేభ్య ఓం నమ స్తద్వీర్య మస్యా యే సాంఖ్యాదితత్త్వభేదా, స్తేభ్యో నమో వర్తధ్వం విరోధేఽనువర్తధ్వమ్ అథోవాచ యే శైవా వైష్ణవా శ్శాక్తా శ్శతసహస్రశ స్తేభ్యో నమో నమో భగవంతో ఽనుమదం త్వనుగృహ్ణాంతు అథోవాచ, యాశ్చ మృత్యోః ప్రాణవత్యస్తాభ్యో నమో నమః, తేనైతాం మృడయత, మృడయత పునరేతస్యాం సర్వాత్మకత్వం భావయిత్వ భావేన పూర్వమాలికా ముత్పాద్యారభ్య తన్మయీం మహోపహారై రుపహృత్య, ఆదిక్షాంతై రక్షమాలా మష్టోత్తరశతం స్పృశేత్ అథ పునరుత్థాప్య, ప్రదక్షిణీకృత్య"

శిష్యుడా ! వినుచుంటివా ? వినుము పై విధముగ పూసలనుసంధించినతరువాత నా మాలను యొకచోటనుంచి నమస్కరించుచు భూమిమీదను, ఆకాశముమీదను, దిక్కులందును తిరుగుచుండు యేయేదేవతలు గలరో అయాదేవతలెల్లరు నీ యక్షమాలికను శోభావంతముగను, జ్ఞానమయముగ నుండునటుల చేయుదురుగాక ! వారికి నమస్కరించుచున్నాను ఏ విద్యలు మంత్రములు కలవో ఆ విద్యలు మంత్రములు వాటి వాటి సర్వశక్తులను యీ యక్షమాలికయందు చేరుటకు వాటికి నమస్కరించుచున్నాను ఏ బ్రహ్మవిష్ణుమహేశ్వరులు కలరో వారు వారియందుండిన సగుణములను, వీర్యములను యీ యక్షమాలికయందుంచుటకు వారికి నమస్కరించుచున్నాను సాంఖ్యాదితత్త్వములందు దేదే భేదములు కలవో అయా భేదము లన్నియు (మాలను త్రిప్పుసమయములందు జరిగెడి ప్రమా

దములను) ఆవర్త యనువర్తధ్వములనన్నిటిని క్షమించవలసి
నదిగా వాటికి నమస్కరించుచున్నాను ఏశైవవైష్ణవశాక్తే
యాదు లనేకసహస్రములుగా కలవో ఆయామత దేవతలకంద
టిని నాయుపాసనను (మాలను) అనుమతించవలసినది. మాటి
మాటికి నమస్కరించుచున్నాను మన్నింతురుగాక ప్రాణ
దేవతయగు యేమృత్యువు కలదో దానికి నమస్కారము వారె
ల్లరు శివ(మృ)డు, లగుదురుగాక శివ(మృడు)లు మఱల వారి
సర్వాత్మభావమును యీ యక్షమాలికయందుంతురుగాక । దీనికి
పూర్వమందు మాలికను యే విధముగ సృజించుటకు తన్మయీ
భావము కలవారై యుండిరో ఆదేభావమును దీనియందు ప్రతి
ష్ఠింతురుగాక । అని ప్రార్థించి యష్టోత్తరశతసంఖ్యగలమాలను
స్పృశించి, లేచి మాలకు ప్రదక్షిణమొనరించి ముకుళితహస్తుడై
యీ క్రిందివిధముగ దేవిని ప్రార్థించవలయును

"ఓం నమస్తే భగవతి మంత్రమాతృకేఽక్షమాలె
సర్వవశంకర్యై న్నమస్తే, భగవతి మంత్రమాతృకేఽక్షమాలికే
శెంస్తంభిన్యై న్నమస్తే భగవతి మంత్రమాతృకేఽక్షమాలికే
ఉచ్చాటన్యై న్నమస్తే మంత్రమాతృకేఽక్షమాలికే విశ్వా
మృత్యై మృత్యుంజయస్వరూపిణి సకలలోకోద్దీపిని సకలలోక
రక్షాధికే సకలలోకోజ్జీ ।త్తే సకలోత్పాదికే దివాప్రవర్తికే రాత్రిప్రవ
ర్తికే నద్యంతరంయాసి, దేశాంతరంయాసి, ద్వీపాంతరంయాసి
లోకాంతరంయాసి సర్వదా స్ఫురసి సర్వహృదివాసయసి నమస్తే
పరారూపే నమస్తే పశ్యంతీరూపే నమస్తే మధ్యమారూపే నమస్తే
వైఖరీరూపే సర్వతత్త్వాత్మికే సర్వవిద్యాత్మికే సర్వశక్త్యాత్మికే
సర్వదేవాత్మికే వసిష్ఠేనమునినాఽఽరాధితే విశ్వామిత్రేణముని
నోపసేవ్యమానే నమస్తే నమస్తే."

ఈవిధముగ పరాశక్తిని సర్వమంత్రాధిష్ఠానదేవిగ ధ్యానించి నమస్కరించవలెను ఆ తరువాత మాలను గ్రహించి జపమునకు వినియోగించుకొనవలెను ఇంతకుపూర్వమీ యక్షములను సువర్ణరజితతామ్రతీగెలతో జట్టించియున్నచో పూర్వోక్తముగ స్నానముచేయించి మాలను హస్తమునం దిడికొని పై విధముగ నక్షమాలికోపనిషత్తును పారాయణచేయవలయును మొదటిసారిమాత్ర మీతీరున జేయవలయును ప్రతిదినమును పారాయణ చేయనవసరములేదు చేసినను దోషములేదు దీనిని జపించువారికి పారాయణఫలమును యీ క్రిందివిధముగ నాయుపనిషత్తు చెప్పుచున్నది దానిని వినుము.

"ప్రాత రధీయానో రాత్రికృతం పాపం నాశయతి, సాయమధీయానో దివసకృతం పాపం నాశయతి, తత్సాయం ప్రాతః ప్రయుంజానః పాపోఽపాపో భవతి ఏవ మక్షమాలికయా జప్తో మంత్రస్సిద్ధికరో భవతీత్యాహ భగవాన్ గుహః ప్రజాపతి మిత్యుపనిషత్ "

ప్రాతఃకాలమునందు దీనిని జపించిన రాత్రియందుచేసిన పాపములు నశించును సాయంకాలమునందు పఠించిన పగటి కాలమునందుచేసిన పాపములు నశించును సాయంకాల ప్రాతః కాలములందు ప్రతిదినమును జపించువా రెంతటిపాపులైనను వారు పాపములనుండి విముక్తులగుదురు ఈవిధముగ నక్షమాలికోపనిషత్తును పఠించినవారు సద్యోకాలమునందే యిష్టసిద్ధిని బొందగలరని భగవంతుడైన కుమారస్వామికి ప్రజాపతి యుపదేశించినాడు ఇవ్విధమున నీయుపనిషత్తు కలదు

నీవడిగిన ప్రశ్నకు కింత గ్రంథమున్నది ఇక రుద్రాక్ష కథనమును వినుము

## రుద్రాక్షల పుట్టుక

నీవు నన్నడిగినవిధముగనే అతి ప్రాచీనకాలమునందు భుసుండనుఋషి కాలాగ్నిరుద్రుని సమీపించి రుద్రాక్షల విషయ మడిగినాడు ఆ వివరమంతయు రుద్రజాబాల్యుపనిషత్తునందు కలదు దానిని చెప్పెదను పరాకులేని చిత్తముతో వినుము.

"ఓమ్ అథ హైనం కాలాగ్నిరుద్రం భుసుండః ప్రపచ్ఛ, కథం రుద్రాక్షోత్పత్తి స్తద్ధారణా త్కింఫలమితి తంహోవాచ భగవాన్కాలాగ్నిరుద్రః, త్రిపురవధార్థ మహంనిమీలితాక్షో భవం స్తేభ్యో జలబిందవో భూమౌపతితా స్తే రుద్రాక్షా జాతా స్సర్వాను గ్రహార్థాయ తేషాం నామోచ్చారణమాత్రేణ దశగోప్రదానఫలం దర్శన స్పర్శనాభ్యాం ద్విగుణఫల మతఊర్ధ్వం వక్తుం నశక్నోమి"

భుసుండుడు కాలాగ్నిరుద్రుని సమీపించి, నమస్కరించి రుద్రాక్షోత్పత్తి యేవిధముగ జరిగినది ? దానిని ధరించినందు వలన కలుగు ఫలమెట్టిది ? అని ప్రశ్నించినాడు భగవంతుడైన కాలాగ్నిరుద్రుడు భుసుండున కిట్లు సమాధానము చెప్పినాడు. ఒకప్పుడు త్రిపురాసురుల వధార్థమై నేను నిమీలితాక్షుడనై యుండగా నాకన్నులనుండి జలబిందువులు భూమిమీద పడినవి. ఆ జలబిందువులనుండి సర్వజనుల క్షేమార్థము రుద్రాక్ష వృక్షములు జనించినవి "రుద్రాక్ష" నామమును స్మరించినంతన పది

యావులను దాన మిచ్చినంతఫలమును పొందును రుద్రాక్షలను చూచినను స్పృశించినను యిరువదిగోవులను దాన మిచ్చినంత పుణ్యమును పొందును అప్పైన లభ్యమయ్యెడి పుణ్యప్రభావ మును చెప్పుటకే శక్తునకు కాని, కొన్ని శ్లోకము లక్కడ యీవిధముగా చెప్పినవి

"తత్రైతే లోకా భవంతి కస్మిన్‌స్థితంతు కిన్నామ కథంవా ధార్యతే నరైః కతిభేదముఖా న్యత్ర కైర్మంత్రై ర్ధార్యతే కథమ్ దివ్యవర్షసహస్రాణి చక్షురున్మీలితం మయా, భూమావక్షిపుటాభ్యాంతు పతితా జలబిందవః తత్రాశ్రుబిందవో జాతా మహారుద్రాక్షవృక్షకాః స్థావరత్వ మనుప్రాప్య భక్తాను గ్రహకారణాత్, భక్తానాం ధారణా త్పాపం దివారాత్రికృతం హరేత్, లక్షంతు దర్శనాత్పుణ్యం కోటిస్తు స్పర్శనా ద్భవేత్, తస్య కోటిశతంపుణ్యం లభతే ధారణాన్నరః లక్షకోటిసహస్రాణి లక్ష కోటిశతానిచ, తజ్జపాల్లభ్యతేపుణ్యంనరో రుద్రాక్షధారణాత్, ధాత్రీ ఫలప్రమాణంయచ్ఛ్రేష్ఠ మేతదుదాహృతమ్ బదరీఫలమాత్రంతు మధ్యమం ప్రోచ్యతే బుధైః, అధమం గణమాత్రంస్యాత్ప్రతి జ్ఞైషా మయోచ్యతే"

షసుందుడా! ఇంకను వినుము అవి యేవిధముగా నున్నవి? వాటి పేరేమి? ధరించవలసిన విధాన మెట్టిది? వాటివాటి ముఖము లెట్టివి? ఏయే మంత్రములతో ధరించవలసి యుండును? అను విషయము లన్నియు వినుము ఒకప్పుడు నేను సహస్రదివ్యవర్షములు తపము చేయుచుండగా నా మూడు కన్నులనుండి నీటిబిందువులు నేలమీద బడినవి ఆ జలబిందు వులనుండి మహారుద్రాక్షవృక్షములు జనించినవి భక్తుల నను

గ్రహించుటకా స్థానము నుండి పోవలసివచ్చెను. రుద్రాక్షలు ధరించి
నంతమాత్రమునకే దివారాత్రములయందు గావించిన పాపము
లన్నియు తొలగును. వీటిని చూచినంతనే లక్షలకొలందిగ
పుణ్యములు చేకూరును. ధరించుటచే కోటిరెట్లుగ పుణ్యము
లభ్యమగును. ఈ రుద్రాక్షలు ధరించిన మానవులకు యొక
కోటిగాదు నూరుకోటుల పుణ్యము సంప్రాప్తించును. లక్షకోటి
సహస్రములకు సమానముగగాని, లక్షకోటికి తుల్యముగగాని
జపములు చేసినదానికంటె యీ రుద్రాక్షధారణవలన పై సంఖ్య
లకు మించిన పుణ్యము లభ్యమగును. ఉసిరికకాయలంత
ప్రమాణముగల రుద్రాక్షలు ధారణకు శ్రేష్ఠములు. రేగుపండంత
ప్రమాణముకలవి మధ్యమములు. శనగగింజంత ప్రమాణము
కలవి అధమములని చెప్పబడును.

"బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శూద్రాశ్చేతి శివాజ్ఞయా,
వృక్షా జాతాః పృథివ్యాంతు తజ్జాతీయాః శుభాక్షకాః, శ్వేతాస్తు
బ్రాహ్మణా జ్ఞేయాః, క్షత్రియా రక్తవర్ణకాః పీతా వైశ్యాస్తు
విజ్ఞేయాః, కృష్ణాః శూద్రా ఉదాహృతాః, బ్రాహ్మణో బిభృయా
చ్ఛ్వేతాన్. రక్తాన్ రాజాతు ధారయేత్ పీతాన్ వైశ్యస్తు బిభృయా
త్కృష్ణాన్ శూద్రస్తు ధారయేత్ సమాః స్నిగ్ధా దృఢాః
స్థూలాః కంటకైః స్సంయుతాః శుభాః, క్రిమిదష్టం ఛిన్నభిన్నం
కంటకైర్హీనమేవ చ, వ్రణయుక్తమయుక్తం చ షడ్రుద్రా
క్షాణి వర్జయేత్ స్వయమేవ కృతం ద్వారం రుద్రాక్షం స్యాది
హోత్తమమ్ యత్తు పౌరుషయత్నేన కృతం తన్మధ్యమం భవేత్,
సమాన్ స్నిగ్ధాన్ దృఢాన్ స్థూలాన్ క్షౌమసూత్రేణ ధారయేత్ సర్వగాత్రేణ
సౌమ్యేన సామాన్యాని విచక్షణః, నికషే హేమరేఖాభా యస్య
రేఖా ప్రదృశ్యతే, తదక్షముత్తమం విద్యాత్తద్ధార్యం శివపూజకైః."

శివాజ్ఞచేత యీ రుద్రాక్షవృక్షకములు బ్రాహ్మణ, క్షత్రియ వైశ్య శూద్రజాతులుగ నుద్భవించినవి బ్రాహ్మణరుద్రాక్ష వృక్షకములు తెల్లనివిగను క్షత్రియరుద్రాక్షవృక్షకములు యెఱ్ఱనివిగను, వైశ్యరుద్రాక్షవృక్షకములు పీత (ఆకుపచ్చ)విగను శూద్రరుద్రాక్షవృక్షకములు నల్లనివిగను వుండును ఆయాజాతుల వారి కాయారంగులుగల రుద్రాక్షలు శ్రేష్ఠములైనవి అనగా బ్రాహ్మణుడు తెల్లనిరుద్రాక్షలను క్షత్రియు డెఱ్ఱని రుద్రాక్షలను వైశ్యుడు పీతరుద్రాక్షలను శూద్రుడు కృష్ణరుద్రాక్షలను ధరింపవలెను ఇట్లు ధరించిన మంచిఫలములు పొందగలరు ఈ రుద్రాక్షలు సమములుగ, నునుపుదనముకలవిగ ముండ్లు కలనిగ, గట్టివిగ, స్థూలములుగలవిగనుండిన శుభములిచ్చును। క్రిమినష్టములు (పురుగులు తొలచినవి), భిన్నములైనవి, ముక్కలుగ(బద్దలుగ)నున్నవి, ముండ్లులేనివి, హీనము (తేలిక)లైనవి రంధ్రము (వ్రణము)లు కలవి యీ యారురకముల రుద్రాక్షలు ధారణకు బనికిరావుగనుక వీటిని విసర్జించవలయును రుద్రాక్షలకు వృక్షమునందుండినప్పుడే రంధ్రము లుత్పన్నములగును స్వయముగా నుత్పన్నములైన రంధ్రము లుండిన పూసలు శ్రేష్ఠములైనవి. రంధ్రములు వేసినవి మధ్యమములైనవి సమానము నునుపు గట్టితనముకల దారముతోగాని, పట్టుదారముతోగాని యీ మణులను మాలగాగూర్చి ధరించవలయును మానవులు సుహృద్భావమున శరీరమునం దన్నిభాగములందును ధరించవచ్చును నికషము (బంగారమును గీచుట కుపయోగించునట్టి రాయి) పై రుద్రాక్షను గీచినప్పుడు బంగారమువంటి గీత పడినచో నారుద్రాక్ష మేలైనది. శివపూజావరు

డిట్టి సువర్ణఛాయగల రుద్రాక్షలను ధరించవలెను విద్యార్థము (బ్రహ్మవిద్య)నకును ఇయ్యది యుపయోగించును

"శిఖాయా మేకరుద్రాక్షం త్రిశతం శిరసావహేత్, షట్త్రింశతం గళే దద్యాద్బాహ్వోః షోడశషోడశ, మణిబంధే ద్వాదశైవ స్కంధే పంచశతం వహేత్, అష్టోత్తరశతైర్మాలా ముపవీతం ప్రకల్పయేత్ ద్విసరం త్రిసరం వాపి సరాణాం పంచకం తథా సరాణాం సప్తకం వాపి బిభృయాత్ కంఠదేశతః, ముకుటే కుండలేచైవ కర్ణికాహారకేఽపివా, కేయూర కటకే సూత్రం కుక్షిబంధే విశేషతః సుప్తే పీతే సదాకాలం రుద్రాక్షం ధారయేన్నరః, త్రిశతం త్వధమం పంచశతం మధ్యమ ముచ్యతే సహస్రముత్తమంప్రోక్త మేవం భేదేన ధారయేత్, శిరసీశానమంత్రేణ కర్ణే తత్పురుషేణ తు, అఘోరేణ గళేధార్యం తేనైవ హృదయేఽపి చ అఘోరబీజ మంత్రేణ కరయోర్ధారయేత్సుధీః పంచాశదక్షగ్రథితాన్ వ్యోమవ్యాప్యపి చోదరే పంచబ్రహ్మభిరంగైశ్చ త్రిమాల పంచ సప్త చ, గ్రథిత్వా మూలమంత్రేణ సర్వాణ్యక్షాణి ధారయేత్"

శిఖయం దొక్కటి, శిరమునందు మూడువందలును, గళమునందు ముప్పదియాఱును, పదునారు పదునారుగ నుభయ బాహువులయందును, పదిరెండుపదిరెండు నుభయ మణిబంధము లందును, పార్శ్వములం దైదువందలను నూటయెనిమిదిగల సంఖ్యగల మాలను యజ్ఞోపవీతముగను, రెండు, మూడు, అయిదు, ఏడు సరములుగ కంఠమునందును, కిరీటకుండలకర్ణిక లకు హారములుగ ధరించుటకు ముఖ్యపదమైన సధనము,

అయిదువందలైన మధ్యమము, పదివందలైన నుత్తమము ఈవిధముగ సర్వకాలములందును రుద్రాక్షలను ధరించుట యుత్తమము. ఈసంఖ్యలందు బుషులమతభేదములును కలవు. ఆయా భేదములనుబట్టి ధరించవచ్చును. "ఈశాన మంత్రముచేత శిరస్సునందును, "తత్పురుష" మంత్రముచేత కంఠమునందును, "అఘోర" మంత్రముచేత గళమునందును హృదయముమీదను (మాలగాధరించిన బొట్టుమీదకు వచ్చును) "అఘోరబీజ" మంత్రములచేత కరములందును ధరించుట బ్రహ్మవేత్తల లక్షణము పండితు లిట్లులే చెప్పుచుందురు. అయిదువందల అక్షములను నూర్ధ్వముఖముగానుండునట్లు మాలగాచేసి సద్యోజాతాదిపంచబ్రహ్మమంత్రములచేత నుదరమునందు ధరించవలెను. మూడు అయిదు, ఏడు మాలలుగాగుచ్చి మూలమంత్రములచేత ధరించవలయును.

కాలాగ్నిరుద్రు డింతవఱకుజెప్పి మౌనమును పాటించినంతనే భుసుండుడు మఱల ప్రశ్నించినాడు.

"అథ హైనం భగవంతం కాలాగ్నిరుద్రం భుసుండః ప్రపచ్ఛ, రుద్రాక్షాణాం భేదేన యదక్షం యత్స్వరూపం యత్ఫలమితి తత్స్వరూపం ముఖయుక్త మనిష్టనిరసనం కామాభీష్ట ఫలం బ్రూహీతి హోవాచ"

అటుతరువాత భగవంతుడైన కాలాగ్నిరుద్రుని భుసుండు డివ్విధముగ ప్రశ్నించినాడు. భగవంతుడా! రుద్రాక్షలందలి భేదములను, వాటి వివరములను, వాటి స్వరూపములను, వాటి ఫలములను వాటి స్వరూపముల నన్నిటిని తెలుపుచు ననిష్టములను నిరసించుచు స్వాభీష్టములను యేవిధముగ తీర్చునదియు

దెలుపుమని యడిగినంతనే కాలాగ్నిరుద్రు డిట్లు చెప్ప సాగినాడు

## రుద్రాక్షల ముఖముల వివరణ

"తత్రైతే శ్లోకా భవంతి ఏకవక్త్రంతు రుద్రాక్షం పరతత్వస్వరూపకమ్ తద్ధారణాత్పరతత్వే లీయతే విజితేంద్రియః. ద్వివక్త్రంతు మునిశ్రేష్ఠ చార్ధనారీశ్వరాత్మకమ్. ధారణా దర్ధనారీశః ప్రీయతే తస్య నిత్యశః. త్రిముఖం చైవ రుద్రాక్ష మగ్నిత్రయస్వరూపకమ్ తద్ధారణాచ్చ హుతభుక్తస్య తుష్యతి నిత్యదా. చతుర్ముఖంతు రుద్రాక్షం చతుర్వక్త్రస్వరూపకమ్ తద్ధారణాచ్చతుర్వక్త్రః ప్రీయతే తస్య నిత్యదా. పంచవక్త్రంతు రుద్రాక్షం పంచబ్రహ్మస్వరూపకమ్ పంచవక్త్రః స్వయంబ్రహ్మ పుంహాత్యాం చ వ్యపోహతి. షడ్వక్త్రమపి రుద్రాక్షం కార్తికేయాధిదైవతమ్, తద్ధారణా న్మహాశ్రీస్స్యా న్మహదారోగ్య ముత్తమమ్, మతివిజ్ఞాన సంపత్తి శుద్ధయే ధారయేత్సుధీః, వినాయకాధిదైవం చ ప్రవదంతి మనీషిణః, సప్తవక్త్రంతు రుద్రాక్షం సప్తమాత్రాధిదైవతమ్, తద్ధారణా న్మహాశ్రీస్స్యా న్మహదారోగ్య ముత్తమమ్. మహతీజ్ఞాన సంపత్తి శ్శుచి ర్ధారణ స్సదా, అష్టవక్త్రంతు రుద్రాక్ష మష్టమాత్రాధిదైవతమ్, వస్వష్టకప్రియం చైవం గంగాప్రీతికరం తథా, తద్ధారణాది మేప్రీతా భవేయు స్సత్యవాదినః, నవవక్త్రంతు రుద్రాక్షం నవశక్త్యధిదైవతమ్. తస్య ధారణమాత్రేణ ప్రీయంతే నవశక్తయః, దశవక్త్రంతు రుద్రాక్షం యమదైవత్య మీరితమ్, దర్శనాచ్ఛాంతిజనకం పాపానాం నాత్ర సంశయః, ఏకాదశముఖం

త్వక్షం రుద్రైరేకాదశదైవతకమ్ తదిదం దైవతం ప్రాహుః సదా సౌభాగ్యవర్ధనమ్ రుద్రాక్షం ద్వాదశముఖం మహావిష్ణుస్వరూపకమ్, ద్వాదశాదిత్యరూపం చ బిభర్త్యేవహి తత్పరః, త్రయోదశముఖం చాక్షం కామదం సిద్ధిదం శుభమ్. తస్య ధారణ మాత్రేణ కామదేవః ప్రసీదతి చతుర్దశముఖం చాక్షం రుద్రనేత్రసముద్భవమ్, సర్వవ్యాధిహరం చైవ సర్వదాఽఽరోగ్యమాప్నుయాత్. మద్యం మాంసం చ లశునం పలాండుం శిగ్రుమేవ చ, శ్లేష్మాతకం విడ్వరాహ మభక్ష్యం వర్జయేన్నరః, గ్రహణే విషువే చైవ మయనే సంక్రమేఽఽపిచ. దర్శేషు. పూర్ణమాసే చ పూర్ణేషు దివసేషు చ, రుద్రాక్షధారణాత్సద్య సర్వపాపైః ప్రముచ్యతే, రుద్రాక్షమూలం తద్బ్రహ్మ తన్నాళం విష్ణురేవ చ, తన్ముఖం రుద్ర ఇత్యాహుః స్తద్బిందు స్సర్వదేవతా ఇతి”

మునిశ్రేష్ఠుడవైన భుసుండుడా! వినుము. నీవడిగిన విషయముల కన్నిటికిని అచ్చట కొన్ని శ్లోకములు కలవు అవి యీవిధమున జెప్పుచున్నవి రుద్రాక్షలందు పదునాలుగు ముఖములు కలవి కలవు ఒక్కొక్క ముఖమున కొక్కొక్క ఫలము కలదు అంతయు చెప్పెదను, వినుము

౧ ఒకముఖము కలది పరతత్వస్వరూపమైనట్టిది ఈ యేకముఖిని ధరించిన పరతత్వజ్ఞానము,విజితేంద్రియత్వములు కలుగును

౨ రెండుముఖములు కలది అర్ధనారీశ్వరస్వరూపము ఈ ద్విముఖిని ధరించిన అర్ధనారీశ్వరుడు నిత్యము సంతోషించుచుండును

౩ మూడుముఖములు కలది అగ్నిస్వరూపము ఈ త్రిముఖిని ధరించిన పితిహోత్రుడు నిత్యము సంతుష్టి కలవాడగును

౪ నాలుగుముఖములు కలది నాలుగుముఖములుండిన బ్రహ్మస్వరూపము ఈ చతుర్ముఖిని ధరించిన చతుర్వర్తి ముఖుడు నిత్యసంతోషముకలవాడుగ నుండును

౫ అయిదుముఖములు కలది కాలాగ్నిరుద్రస్వరూపము దీనిని ధరించినవారు పురుషునిచంపిన పాపములను పంచవక్త్రస్వరూపుడు తొలగించును

౬ ఆరుముఖములు కలది కుమారస్వామిరూపము ఈ షణ్ముఖిని ధరించిన మహదైశ్వర్యము లభ్యపడును ఆరోగ్యము కలుగును కొందరీ షణ్ముఖిని గణపతిరూపమనియు నందురు అందుచేత మేధాసంపత్తి ధారణాశక్తులు కలుగును బుద్ధిబలము విచక్షణాజ్ఞానములును లభ్యపడును

౭ ఏడుముఖములు కలది సప్తమాతృకస్వరూపము. దీనిని ధరించిన "బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండా" యను సప్తమాతృకల యనుగ్రహమువలన మహదైశ్వర్యము, ఆరోగ్యములు కలుగును ఉత్తమస్థితియును కలుగును

౮ ఎనిమిదిముఖములు కలది అష్టమాతృక స్వరూపము దీనిని ధరించిన పై సప్తమాతృకలును గంగాదేవితో గూడిన (అష్టమాతృకలగుదురు) అష్టమాతృకలు సంతసించుచు వసువులును ప్రీతినొందుదురు సత్యవాదిత్వ మలవడును

౯ తొమ్మిదిముఖములు కలది నవశక్తిస్వరూపము దీనిని ధరించిన ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి క్రియాశక్తి, శాంతశక్తి, వామశక్తి, జ్యేష్ఠశక్తి, రౌద్రీశక్తి, అంబికశక్తి, పశ్యంతీశక్తి" అను నవశక్తులు సంతసింతురు

౧౦ పదిముఖములు కలది యమస్వరూపము దీనిని చూచినమాత్రమున శాంతి కలుగును పాపములు తొలగును. (ఇక దీనిని ధరించినచో పూర్ణశాంతి కలవాడగును)

౧౧ పదునొకండుముఖములు కలది యేకాదశరుద్రస్వరూపము దీనిని ధరించిన "అజుడు, ఏకపాదుడు, అహిర్బుధ్న్యుడు, త్వష్ట రుద్రుడు హరుడు, శంభుడు, త్ర్యంబకుడు, అపరాజితుడు, ఈశానుడు, త్రిభువను డను యేకాదశరుద్రులు సంతసింతురు నిత్యము సౌభాగ్యము వృద్ధియగుచుండును

౧౨ పదిరెండుముఖములు కలది ద్వాదశాదిత్యరూపము, శ్రీమహావిష్ణుస్వరూపము కలదియును దీనిని ధరించిన "ఇంద్రుడు, ధాత, పర్జన్యుడు, త్వష్ట పూషుడు, అర్యముడు, భగుడు, వివస్వంతుడు విష్ణువు, అంశుమంతుడు, వరుణుడు, మిత్రు"డను ద్వాదశాదిత్యులు సంతసింతురు ఆరోగ్యము, ఐశ్వర్యములు లభ్యపడును

౧౩ పదమూడుముఖములు కలది మన్మధరూపము దీనిని ధరించిన కామదేవుడు కోరికలు సిద్ధింపచేయును శుభములను ప్రసాదించును

౧౪ పదునాలుగుముఖములు కలది రుద్రనేత్ర స్వరూపము ఇది రుద్రునినేత్రమునుండి జనించినది దీనిని ధరించిన సర్వవ్యాధులును తొలగును నిత్యము సంపూర్ణారోగ్యముండును

రుద్రాక్షలను ధరించువారు కొన్ని నియమములను పాటింపవలెను మద్యము, మాంసము వెల్లుల్లి, నీరుల్లి మునగ నకేరు మున్నగువాటిని విసర్జించవలయును గ్రహణ సమయమునందు విషువ (పగలు రాత్రి సమానముగ నుండు) కాలమునందు, అయన (ఉత్తరాయణ) పుణ్యకాలమునందు, సూర్యసంక్రమణకాలమునందు అమావాస్య పూర్ణిమలయందును హెచ్చుతగ్గులేని పూర్ణతిథులయందును రుద్రాక్షలను ధరించిన సర్వపాపములు వెంటనే తొలగునని చెప్పబడినది రుద్రాక్షయందలి మూలము బ్రహ్మము, నాళము విష్ణువు, ముఖము రుద్రుడు దానియందలి బిందుస్థానము సర్వదేవతాస్థానముగ చెప్పబడినది ఋషులందువకిట్లు చెప్పబడినది

"అథ కాలాగ్నిరుద్రం భగవంతం సనత్కుమారః పప్రచ్ఛాధీహి భగవన్రుద్రాక్షధారణ విధిమ్, తస్మిన్ సమయే నిదాఘ జడభరత దత్తాత్రేయ కాత్యాయన భరద్వాజ కపిల వసిష్ఠ పిప్పలాదాదయశ్చ కాలాగ్నిరుద్రం పరిసమేత్యోచుః అథ కాలాగ్నిరుద్రః కిమర్థం భవతామాగమన మితి హోవాచ, రుద్రాక్ష ధారణవిధిం వై సర్వే శ్రోతుమిచ్ఛామహా ఇతి అథ కాలాగ్నిరుద్రః ప్రోవాచ, రుద్రస్యనయనా దుత్పన్నా రుద్రాక్షా ఇతి లోకే ఖ్యాయంతే, అథ సదాశివ స్సంహారకాలే సంహారంకృత్వా సంహారాక్షం ముకుళీకరోతి తన్నయనా జ్జాతా రుద్రాక్షా ఇతి హోవాచ తస్మా ద్రుద్రాక్షత్వ మితి"

తరువాత (కాలమునందొక్కనాడు) భగవతుడైన కాలాగ్నిరుద్రుని సనత్కుమారుడు సమీపించి భగవంతుడా! రుద్రాక్షధారణవిధిని తెలుపుమని యడుగుచుండు సమయము

నందే "నిదాఘుడు, జడభరతుడు, దత్తాత్రేయుడు, కాత్యాయనుడు, భరద్వాజుడు, కపిలుడు, వసిష్ఠుడు, పిప్పలాదుడాదిగాగల మహర్షులచ్చటికి వచ్చిరి కాలాగ్నిరుద్రుడు వారిని చూచి, మీ ఆగమన మెందులకని ప్రశ్నించినమీదట నా మహర్షులం రుద్రాక్షధారణవిధి నంతటిని వినదలచి వచ్చితిమని విన్నవించిరి మహర్షులకు కాలాగ్నిరుద్రుడు రుద్రాక్షల విషయము లిట్లనియుం జెప్పె, రుద్రుని నేత్రములనుండి జనించినవిగనుక లోకమునం దియ్యవి "రుద్రాక్షి"అని పేరొందినవి సదాశివుడు సంహార కాలమునందు సంహారమొనరించి ముకుళించిన నేత్రముల నుండి జనించినవి ఆకారణముచేత నియ్యవి "రుద్ర-అక్షము" "రుద్రాక్ష" అయినవి

"కాలాగ్నిరుద్రః ప్రోవాచ. తద్ధృద్రాక్షే వాగ్విషయే కృతే దశగోప్రదానేన యత్ఫల మవాప్నోతి తత్ఫలమశ్నుతే. స ఏష భస్మజ్యోతిరుద్రాక్ష ఇతి తద్రుద్రాక్షం కరేణ స్పృష్ట్వా ధారణమాత్రేణ ద్విసహస్రగోప్రదానఫలం భవతి. తద్రుద్రాక్షే కర్ణయో ర్ధార్యమాణే ఏకాదశసహస్రగోప్రదానఫలం భవత్యేకాదశరుద్రత్వం చ తద్రుద్రాక్షే శిరసి ధార్యమాణే కోటిగోప్రదాన ఫలం భవత్యేతేషాం స్థానానాం కర్ణయోః ఫలం వక్తుం నశక్య మితి హోవాచ".

మరల కాలాగ్నిరుద్రుడా మహర్షులతో జెప్పనుపక్రమించినాడు. ఆ రుద్రాక్ష నిత్తుననినను, "రుద్రాక్షి' యని పృచ్ఛించినను పది గోదానముల ఫలమును పొందును ఆ పుణ్య ఫలము ననుభవించును అదేవిధముగా భస్మజ్యోతిరుద్రాక్షను (భస్మముతోగూడి జ్యోతివంటి తేజముండిన రుద్రాక్ష అనగా

బంగారమునవలెనుండిన రుద్రాక్ష దీనికి భస్మమలదినదని భావము (నికషము – బంగారు ఒరపిడిరాయి) పై గీచిన బంగారు రంగు కనుపించిన" అనుమానము యిట (గ్రహించవలెను) హస్తముతో స్పృశించి, ధరించినమాత్రముననే ద్విసహస్రగోదానఫలమబ్బును ఆరుద్రాక్షను కర్ణములందు ధరించిన యేకాదశసహస్రగోప్రదాన ఫలమును పొందును ఏకాదశరుద్రత్వమును కలుగును ఆరుద్రాక్షను శిరస్సునందు ధరించిన కోటిగోప్రదానఫలమును పొందును ఇతరస్థానములందును కర్ణములందును ధరించుటవలన కలుగు ఫలమిట్టిదని చెప్పుటకు సాధ్యముకాదు,

"య ఇమాం రుద్రాక్షజాబాలోపనిషదం నిత్య మధీతే బాలో వా యువా వా వేదనమహాన్ స్వవతి, స గురు స్సర్వేషాం మంత్రాణా ముపదేష్టా భవతి, ఏతై రేవ హోమంకుర్యా దేతై రేవార్చనం తథా రక్షోఘ్నం మృత్యు తారకం గురుణా లబ్ధం కంఠే బాహౌ శిఖాయాం వా బధ్నీత సప్తద్వీపవతీభూమి ర్దక్షిణార్థం నా ఎకల్పతే తచ్ఛ్రద్ధయా యాం కాంచిద్గాం దద్యాత్సా దక్షిణా భవతి య ఇమా ముపనిషదం బ్రాహ్మణ స్సాయ మధీయానో దివసకృతం పాపం నాశయతి, మధ్యాహ్నేఽధీయాన షడ్జన్మకృతం పాపం నాశయతి, సాయం ప్రాతః ప్రయుంజానోఽనేకజన్మకృతం పాపం నాశయతి షట్సహస్రలక్షగాయత్రీజప ఫల మవాప్నోతి బ్రహ్మహత్యా సురాపాన స్వర్ణస్తేయ గురుదారగమన తత్సంయోగపాతకేభ్యః పూతో భవతి, సర్వతీర్థఫల మశ్నుతే, పతితసంభాషణాత్పూతో భవతి, పంక్తిశతసహస్ర

పావనో భవతి, శివసాయుజ్య మవాప్నోతి నచ పునరావర్తతే నచ పునరావర్తత ఇత్యోంగ్ సత్య మిత్యుపనిషత్

ఎవ్వడీ రుద్రాక్ష (జాబాలమహర్షి వలన ప్రాచుర్యమొందిన యీ) జాబాలోపనిషత్తును నిత్యము పారాయణ మొనరించునో అతడు బాలుడై నను యువకుడై నను వేదపారాయణఫలమును పొందును గురువువలన నుపదేశముపొందిన సర్వమంత్రముల ఫలమును పొందుటయేగాక గురుస్థానమున కధికారియునగును ఈ యుపనిషన్మంత్రములచేత హోమ మొనరించిన భగవానుని పూజించిన ఫలమును, రాక్షసుల బాధయును మృత్యుభయము లేకుండుటయు జరుగును గురుప్రసాదయుద్రాక్షలను కంఠమునందు, బాహుమూలములయందు, శిఖయందు బంధించిన, నట్టివానికి యేడుద్వీపములను (సప్తసాగరావృతమైన భూమి నంతటిని) దక్షిణలతోసహా దానమొనరించినంత పుణ్యఫల మొనగూడును, శ్రద్ధతో, దక్షిణతోగూడిన బంగారుగోవును యిచ్చినంత పుణ్యఫలమును పొందును ఈ యుపనిషత్తును ప్రతినిత్యము సాయంకాలమునందు పారాయణమొనరించిన నాడినమునం దాచరించిన పాపములు నశించును మధ్యాహ్నమునందు పారాయణ చేసినచో ఆరుజన్మలనుండిచేసిన పాపములన్నియు నశించును ఉదయ సాయంకాలములందు పఠించిన అనేకజన్మార్జిత పాపము లన్నియు నశించును ఆరు వేలలక్షలసారులు గాయత్రిని జపించినంతఫలమును పొందును బ్రహ్మహత్య, సురాపానము, స్వర్ణస్తేయము, గురుదారాగమనము, పుణ్యసకుల సంయోగ ములవంటి మహాపాతకములనుండి విముక్తుడినవాడై పవిత్రుడగును సర్వతీర్థఫలమును పొందును పతితులతో సంభాషిం

చిన పాతకము పోవును. శతసహస్రములుగా పంక్తులుగల పావనత్వమును పొందును తుదకు శివసాయుజ్యమును పొందును తిరిగి జన్మించడు, తిరిగి జన్మించడు ఈవిధముగా నీయుపనిషత్తు (సత్యామను) చెప్పె సత్యోపనిషత్తైనది

శిష్యుడా! వింటివా? ఉపనిషత్తులందు రుద్రాక్షల కథనమును తెలిసెనా? ఇంకను సందేహము కలదా?— మఱచితిని ఇంతకు నీపేరేమి?)

శిష్యుడు — నాపేరు శివానందప్రసాద్ అందరు నిట్లనే పిలుచుచున్నారు మీరు నిట్లనే ఎలువవచ్చును గురుదేవా! మఱియొక సందేహము ఈరుద్రాక్షదుల విషయము పురాణములందును కలదా? ఉన్నచో భేదములును కలవా? ఆవిషయములను, మతభేదములను జెప్పుచు తులసీపూసలు వితర మణులవిషయములను వినుపించగోరుచున్నాను వెంటబడి యడుగుచుంటినని ఆగ్రహించవలదని యర్థించుచున్నాను

గురువు — బాగుగా నడిగితివయ్యా! చక్కగా నడిగితివి అడిగితెలిసికొనుట లిట్లేయుండవలయును నీపేరు శివానందప్రసాద్ ఎంత చక్కని పేరు! శివుడు-ఆనందుడు, శివానందుడు, శివానందునిచేత ననుగ్రహించబడినవాడు శివానందప్రసాదుడు ఇందుచేతనేకాబోలు యిట్టి ధర్మములు గ్రహించుట కాసక్తి జనించినది ఇక, నీవడిగినవిధముగ రుద్రాక్షదుల విషయములు దేవీభాగవతాదులవంటి పురాణములందును కలవు స్వల్పభేదములు, ఫలభేదములును కలవు అన్నిటిని సమన్వయమొనరించి చెప్పెదను వినుము ఇంతకుముందు వినిన విధముగ రుద్రాక్షలందు పదునాలుగు విధములు కలవు. వాటిని

"ఏకముఖి, ద్విముఖి" యను పేరులతో ఫలములను జోడించి చెప్పెదను.

## రుద్రాక్షలు – వాటి ఫలములు

౧ ఏకముఖి-ఇది శివస్వరూపముకలది దీనిని ధరించుట వలన శక్తి కలుగును ముక్తియును లభ్యమగును ఏకముఖి రుద్రాక్షను దర్శించినంతమాత్రముననే బ్రహ్మహత్యాది మహా దోషములు నివృత్తములగును తీరని కష్టమునందున్నవారు దీనిని ధరించిన కష్టములనుండి విముక్తులై భోగభాగ్యములు కలవారుగనుందురు

౨ ద్విముఖి – రెండుముఖములుండిన దీనిని అర్ధనారీశ్వరమందురు దీనిని ధరించుటవలన గోవధాది పాపములు నశించగలవు సర్వాభీష్టములును సిద్ధించును శివసాన్నిధ్యమును రాగలదు

౩ త్రిముఖి – మూడుముఖములుండిన రుద్రాక్ష అగ్ని వంటిది దీనిని ధరించుటచేత బ్రహ్మహత్య, స్త్రీహత్యాది మహా పాపములు భస్మమగును యజ్ఞపురుషుని అనుగ్రహముకలిగి విద్యావంతులుగ, ధనవంతులుగ, నిరోగులుగ నుందురు.

౪ చతుర్ముఖి-నాలుగుముఖములుండిన రుద్రాక్ష నాలుగు ముఖములుకల బ్రహ్మదేవునివంటిది దీనిని ధరించుటచేత జ్ఞానవిద్య సంప్రాప్తమగును ధనము లభ్యపడును ఆరోగ్యము నకు లోటురానేరదు పాపములు శమించును ఆనందమును ప్రాప్తించును దీనిని శిరస్సునందు కుడిభాగమునందు ధరించవలెను

౫ పంచముఖి - అయిదు ముఖములుండిన యీ రుద్రాక్షి కాలాగ్ని రుద్రుని వంటిది కొందరు పంచముఖుడైన బ్రహ్మము వంటిదనియు చెప్పుదురు దీనిని ధరించుటచేత భుక్తిముక్తులు కలుగును శంకరుని అనుగ్రహపాత్రుండగును చేయరాని పనులు చేసిన దోషములు, పరస్త్రీగమనాది దోషములు, వ్యభిచార దోషములు నిషిద్ధాన్నభోజన దోషములాదిగాగల దోషములన్నియును నశించును

౬ షణ్ముఖి - ఈ రుద్రాక్షి ఆరుముఖములు కల కుమారస్వామి రూపము కొందరు గణపతిరూపము కలదనియు నందురు దీనిని ధరించినవారు సభలయందు పండితులతో వాగ్వాదము నొనరించి విజయులయ్యెదరు సంపూర్ణ విద్యావంతులగుచుందురు దీనిని కుడిహస్తమునందు ధరించిన బ్రహ్మహత్యాది మహాపాతకములు తొలగును

౭ సప్తముఖి - ఏడు ముఖములుండిన యీ రుద్రాక్ష అనంతుని రూపమువంటిది కొందరిదానిని మన్మథ స్వరూపమనియు నందురు సప్తమహాఋషుల రూపమునగును సప్తమాతృకల రూపమనియు కలదు దీనిని ధరించుటచేత స్వర్ణస్తేయాదిపాపములు శమించును. శ్రీ మహాలక్ష్మి అనుగ్రహము కలిగి మహదైశ్వర్యము లభ్యపడును భోగానుభవము నుండును బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండా యను సప్తమాతృకల యనుగ్రహము వలన మహదైశ్వర్యము కలిగి మహారాజువలె నుండును ఆరోగ్యవంతుడుగ, పుణ్యవంతుడుగ, లబ్ధప్రతిష్ఠుడుగను నుండును

౮ అష్టముఖి - ఎనిమిది ముఖములుండిన యీ రుద్రాక్ష అష్టముఖగణపతి స్వరూపము కలది కొందరీ రుద్రాక్షను గంగా

చేవియు సప్త మాతృకలతోఁగలిపి అక్షమాత్రుక రూపమనియు చెప్పెదరు దీనిని ధరించువారలకు దరిద్రముండదు సప్త మాతృకలతోఁగూడిన గంగాదేవి సంతసించును "అపుడు. ధ్రువుడు, సోముడు, అధ్వరుడు, అనిలుడు, ప్రత్యూషుడు, అనలుడు, ప్రభాసు"లను అష్టవసువు లెక్కువగా సంతసించుటయే గాక నిరంతరము రక్షించుచుందురు ప్రాశోత్కృష్టమైన సమయమునందు శివుడు స్వయముగవచ్చి, కైలాసమునకుం గొని పోవును గురుద్రోహాదిపాతకములు, పరస్త్రీగమనదోషము, అనృతదోషములు తొలగును

౯. నవముఖి - తొమ్మిదిముఖములు కల యీ రుద్రాక్ష పుణ్యపాపములను విచారించునట్టి ధర్మపురుషుని స్వరూపము కొందరు దీనిని భైరవరూపమనియు, నవశక్తి స్వరూపమనియు జెప్పుదురు దీనిని ధరించుటవలన సర్వపాపములు క్షయించును దీనిని వామభుజమునందుధరించిన బ్రహ్మహత్యాది మహాపాతకములు నశించును భుక్తిముక్తులు కలుగును రెండుభుజములందును ధరించిన సుఖభోగములు లభ్యపడును ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి, కాంతశక్తి, వామశక్తి, జ్యేష్ఠశక్తి, రౌద్రీశక్తి, అంబికశక్తి, పశ్యంతీశక్తియను నవశక్తుల యనుగ్రహమును పొంది శివరూపుడుగ మారును

౧౦ దశముఖి - పదిముఖముల యీ రుద్రాక్ష సర్వదిక్కులందును వ్యాపించిన విష్ణుస్వరూపమునకు తుల్యమైనట్టిది కొందరు దీనిని యమాధిదైవత్వము కలదనియు, దశదిక్పాలుర స్వరూపమైనట్టిదనియు నందురు దీనిని ధరించుటచేత సర్వకార్యసిద్ధి, నవగ్రహానుకూలత, భూతభేతాళ బ్రహ్మరాక్షసాదుల

నుండి భయముచెకుండుటలు కలుగును కాంతికాము కుడుగను నుండును

౧౧ ఏకాదశముఖి – ఏకాదశముఖములుండిన యీ రుద్రాక్ష యేకాదశరుద్రాత్మకంబై నది ఏకాదశరుద్రులకియ్యది కేంద్రరూపము దీనిని ధరించుటచేత భాగ్యము, ధనము, సహస్రాశ్వ మేధయాగఫలము శివానుగ్రహప్రాప్తి, యత్నకార్యసిద్ధి మున్నగు ఫలములు కలుగును

అజుడు ఏకపాదుడు, అహిర్బుధ్న్యుడు, త్వష్ట, రుద్రుడు, హరుడు, శంభుడు, త్ర్యంబకుడు, అపరాజితుడు, ఈశానుడు త్రిభువనుడను యేకాదశరుద్రులు నిరంతరము సంతసించుచుందురు శిరముమీద ధరించవలెను

౧౨ ద్వాదశముఖి – పండెండు ముఖములుకల యీ రుద్రాక్ష ద్వాదశాదిత్యరూపమున నుండును విష్ణువునకియ్యది ప్రతిరూపము దీనిని శిఖయందు ధరించిన "ఇంద్రుడు, ధాత, పర్జన్యుడు, త్వష్ట, పూషుడు, అర్యముడు, భగుడు వివస్వంతుడు, విష్ణువు, అంశుమంతుడు, వరుణుడు, మిత్రుడను ద్వాదశాదిత్యులు సంతసింతురు అన్నివిధములగు వ్యాధులు నివారణ యగును కర్ణములందు ధరించిన ద్వాదశాదిత్యులకు సేవచేసినంతఫలము సంప్రాప్తమగును పాపములు నశియించును దరిద్రబాధ యుండదు

౧౩ త్రయోదశముఖి – ఈ పదమూడు ముఖములుండిన దీనికి గార్తికేయు డధిదేవత కొందరీ రుద్రాక్షను మన్మథ రూపమనియు చెప్పుదురు ఇది దొరకుట దుర్లభము దొరికినప్పుడిద్దానిని ధరించినయెడల సంతానహీనులు సంతానవంతు

లయ్యెదరు కుమారస్వామివంటి ధర్మజ్ఞాన బల వీర్యములను పొందెదరు జీవితాంతమువరకును సర్వభోగములను పొందును సర్వసుఖములను అనుభవించును కీర్తి, గౌరవము ధనసంపదలు నుండును

14 చతుర్దశముఖి - పదునాలుగు ముఖములు కల రుద్రాక్ష సదాశివునకు ప్రతిరూపము ఇది శివుని తృతీయ నేత్రమువంటిది దీనిని లలాటమునందే ధరించవలయును ఇట్టిదానిని ధరించినవారు సదాశివానుగ్రహమునకు పాత్రు లయ్యెదరు శిరమునందు ధరించిన సర్వరుగ్మతలనుండి విముక్తి కలుగును కామక్రోధాది దుర్గుణములంటవు కష్టములు వ్యసనములును దరిచేరవు

ఇవిగాక "గౌరీశంకర" మనబడు రుద్రాక్ష మొకటి కలదు రెండు రుద్రాక్షలు వేరువేరుగా కనిపించుచు నొకటిగనే యుండును రంధ్రము నొక్కటిగనే యుండును దీనిని గౌరీశంకరులుగ భక్తిశ్రద్ధలతో పూజించవచ్చును ధన మున్నతావునను ంచిన ధనాభివృద్ధి యగుచుండును కంఠమునందును ధరించవచ్చును సర్వశుభములు చేకూరుచుండును

శివానందా! రుద్రాక్షల కథనంతటిని వింటివికదా వీటి యందెట్టిదానినైనను ధరించవచ్చును ఇహలోక పరలోకసుఖములను బడయవచ్చును రుద్రాక్షలను ధరించి పవిత్రులైనవారి గాథలు బ్రహ్మాండము, దేవీభాగవతాదులందు కలవు అందొక్క కథను వినుపింతును ఆనందముగ వినుము

# మహానంద కథ

కాశ్మీర దేశమునకు భద్రసేనుండను వాడు ప్రభువుగ నుండెను అతనికి సుధర్ముండను పుత్రు డొక్కఁడుండెను ఆ రాజునకు మంత్రియొక్కఁడు గలడు ఆ మంత్రికిని తారకుండను కుమారుడు గలడు రాజకుమారుడు మంత్రికుమారుడు ఇద్దరు నెచ్చెలికాండ్రు ఆటపాటలయందును విద్యాభ్యాసమునందును కలసిమెలసియే యుండిరి వారి మైత్రి అగాధమైనట్టిది. వారు సర్వదా రుద్రాక్షమాలలు ధరించుచుందురు ఆ కుమారులను వారి తండ్రులు రత్నాలహారములను ధరించుడని, రుద్రాక్షలు తీసి వేయుడని పెక్కువిధములుగా చెప్పినను వినక, వారు రుద్రాక్ష మాలలనే ధరించుచు, వాటినే భగవత్స్వరూపములుగ భావించు చుండిరి

ఒక్కనాడా రాజువద్దకొక మునివచ్చెను ఆ ముని భస్మమును ధరించెను రుద్రాక్షమాలలు కంఠమున వ్రేలాడు చుండెను ఆ మహర్షిపేరు పరాశరుడు. వచ్చిన పరాశర మహార్షినిచూచి రాజు దిగ్గున సింహాసనమునుండి లేచి, యెదురుగా నేఁగి, సమీపించి, నమస్కరించి అర్ఘ్యపాద్యాదికములర్పించి, సింహాసనస్థుని గావించి ప్రాంజలించి మహర్షితో నిట్లనినాడు

బ్రహ్మతేజుడా ! మీ రాకవలన మేమును మా ప్రజలును ధన్యులము నాదొక వినతి అంగీకరింతురని యీ భృత్యుని అనుగ్రహింతురని నమ్ముచున్నాను తమ యెదురుగ నున్న బాలురు నా తనయుండొక్కఁడు, మంత్రి తనయుండొక్కఁడు వీరు నిరంతరము రుద్రాక్షమాలలనే ధరింతురు, రత్నాలహారములను తిరస్కరించుచుందురు ఎన్నివిధములుగ

చెప్పినను వినరు వీరి కైదములకుందగిన కారణములు కలవా? ఉన్నచో దయయుంచి తెలుపగోరుచున్నాననుచు ప్రాంజలియై మునిపుంగవునెదుట నిలువంబడినాడు

పరాశరమహర్షి రాజు ప్రార్థన మంగీకరించి బాలురను వీక్షించి, కనులుమూసి కొంతతడవు నిశ్చలుండై, బాలుర పూర్వజన్మవృత్తాంతములను గ్రహించి కనులుదెరచి రాజను చూచినాడు, రాజా! వినుము వరాకు నెందుకుము వీరిట్లు లుండుటకుందగిన వీరి పూర్వజన్మముల కథనములను వినిపింతును

నంది గ్రామమను యొక గ్రామము కలదు ఆ గ్రామమునందు చాతుర్వర్ణ్య ప్రజలు కలరు అందరును ధార్మికులై స్వవర్ణాశ్రమాచారనిరతులై ఆ నంది గ్రామమునందు "మహానంద"యను వేశ్య క దు అయమ్మ గృహము సర్వసౌభాగ్యములకు నిలయము పాడితప్పదు ధర్మమును సేవించుచు నియతయై వేశ్యధర్మమును పాటించుచుండును మహావైభవము ననుభవించుచున్నను తన గృహమున కేతెంచు విటుల నవమానించదు ఆదరించును, తన వేశ్యాధర్మమును వారిట్టులకు భంగమురానివిధముగ మర్యాదలతో రతిసుఖము లిచ్చుచుండును వపూజయు గావించుచుండెడిది

ఆ మహానంద వినోదమునకుంగాను యొక మర్కటమును ఒక కోడిని పెంచినది ఆరెంటిని రుద్రాక్షలచే నలంకరించినది నాట్యము నేర్పినది తాను తాళము వేయుచు బాడుచు వాటిచేత నృత్యము నేయించుచు వినోదించుచుండెడిది.

ఇట్టి మహానంద యింటి కొక్కదినమునందొక వైశ్యు డేతెంచెను. అతడు భస్మరుద్రాక్షధరుండయ్యును హస్తమునందు విలువగల మణికంకణమును ధరించియుండెను. దానియందు రత్నములుండుటచేత ధగద్ధగాయమానముగ శోభించుచుండెను. మహానందా వైశ్యుని యాదరించి, తనకా కంకణము నీయుదని కోరినది. అందులకా వైశ్యుడు కంకణము నూరక యివ్వననియు, వలయుచో ధనమిచ్చి కొనుమనియు జెప్పవాడు. ఈ మాటలు వినిన మహానంద, పుణ్యపురుషా! నేను వేశ్యను. నా వృత్తియు వేశ్యావృత్తియే. కావున కంకణ మిచ్చినచో నా నియమముల ననుసరించి మూడుదినములు నీకు భార్యగా నుందును. సమ్మతింపుమనెను. వైశ్యుడా మహానందకు దన చేతికింగల మణికంకణము నొసంగి, నీతో నుండుట కంగీకరించితినని ఆమె హృదయమును స్పృశించెను. వెనువెంటనే నావద్ద రత్నములతో చేయబడిన శివలింగము కలదు. అది నా ప్రాణతుల్యము. దానిని నీకిత్తును. ఈ మూడురోజులు లింగమును కాపాడి, నాల్గవదినమున నా కిమ్మనుచు శివలింగమును మహానంద కరమునం దుంచినాడు. ఇది పోయినచో నా మరణము నిజమనియు హెచ్చరించినాడు.

మహానందా శివలింగమును గ్రహించి, కన్నుల కద్దుకొని భక్తిభావముతో నాట్యమంటపమునందు స్తంభముమీద సురక్షితముగ నుంచినది. ఆరాత్రి వైశ్యునితో దన కులవృత్తి ధర్మము ననుసరించి అతనికి భార్యగానుండి, రతిసుఖములిచ్చి కొంతవడికి నిదురించినది.

ఆ మహానంద నిదురించు సమయమునందు నాట్యమంటపమునం దగ్నిహోత్రము బయలుదేరినది. గృహమంత

టిని అగ్ని చుట్టుముట్టాడసాగినది. మహానంద లేచి, రత్న శివ లింగముంచిన తావునకుంజని, బంధించిన కోతిని, కోడిని విడిపించినది. ఆ మర్కట కుక్కుటములు దూరదూరముగా బరువెత్తినవి. మంటలందు నాట్యమంటపమంతయు గాలి బూడిదయైనది. లింగము నందే కాలి పగిలినది.

అంతట వైశ్యుడా మహానందను చూచి నా శివలింగ మును నీవు రక్షించక అగ్నియందు పాడుచేసితివి. నేనిక బ్రతుక లేను. మరణింతును. గ్రామము వెలుపల చితిని పేరిపించుము. ఆ యగ్నియందు శరీరమును విడుతునని యొత్తిడి గావించెను. మహానంద ధర్మమునకుం గట్టువడి యూరివెలుపల చితిని పేర్పించినది. అగ్నిని రగుల్కొలిపినది. మంటలు లేచినవి. ఆ మంటలందా వైశ్యుడు ప్రవేశించినాడు.

ఆపైన మహానంద బంధుగులను మిత్రులను రావించి మూడుదినములవఱకు భార్యగా నుందునని వైశ్యునకు మాట యిచ్చితిని. నా బాస ననుసరించి యీదినము మొదటి దినమె. ఇంకను రెండురోజులు గడువవలయును. ప్రథమ దినమునందే భర్తగానుండిన వైశ్యుడు మరణించినాడు. నేనాతనికి భార్య నగుట సహగమన మొనరించెదను. నాకుంగల సర్వస్వము మీ కొసంగుచున్నాను. గ్రహింపుడనుచు, చితికి ముమ్మారు ప్రద క్షిణముచేసి, శంకరా! నా ధర్మము ననుసరింపదలచితిని. గతిం చిన భర్తకును, నాకును నీ సన్నిధి ననుగ్రహించుమని ప్రార్థిం చుచు జితిమంటలందు దూకసాగినది.

ఇంతలో సుమాధవుడు ప్రత్యక్షమై “మహానందా! ఆగుము. నిన్ను పరీక్షించుటకేను వైశ్యునిగా వచ్చితిని. కుల

వృత్తియందున్నను మాటికిం గట్టువడి పత్నీబాపమును త్రివృత్కారణములచేతను చూపితివి నీవు పవిత్రుండవు విగత పాపవు నీ గృహము- నాట్యమంటపములన్నియు సురక్షితము లగ నున్నవి జరిగిన చర్యయంతయు నా మాయా! ఎథావ మని తెలిసికొనుము ఈ జన్మమున పుత్రులను కని, దివ్య సుఖము లనుభవించుటకును దీర్ఘాయువు నిచ్చుచున్నాను ఇంకేమి కావలయునో కోరుము ఇత్తు ననెను

మహానంద చంద్రశేఖరునకు సాగిలబడి నమస్కరించి దేవదేవా! నన్ను మన్నించుము నాకీలోక సుఖములేమియు వలదు నాను నా యీ బంధుమిత్ర పరివారమునకును శాశ్వతముగా నీ సన్నిధియందుండునటుల అనుగ్రహించుము ఇదియే నా కోరిక అని ప్రార్థించినది శివుడా వరము ననుగ్రహించినాడు మహానంద పరివారముతోఁగలసి శివధామమునకుం జనినది

మహానందచే పెంచబడిన మర్కట కుక్కుటములు రుద్రాక్షలు ధరించియే మిత్రములుగనుండి కాలాంతరమున మరణించిరి ఆ మర్కట కుక్కుటములే యీ కుమార ద్వయముగా జనించినవి పూర్వజన్మమునందు ధరించిన రుద్రాక్షధారణచేత దివ్యముగ జనించియు, నా రుద్రాక్షలనే ధరించుచుండిరి రాజా! వింటివా! వీరి పూర్వజన్మవృత్తాంతము లియ్యవి రుద్రాక్ష మహిమ యిట్టిదని పరాశరమహర్షి భద్రసేనునకు రుద్రాక్ష మహిమను వినుపించెను

వింటివా శివానందుడా! మహిమ తెలిసికొనుట కొక్కటి చాలును రుద్రాక్ష ధారణమునుగూర్చిన సార మీతీరున నున్నయది

"రుద్రాక్షధారణాద్రుద్రో భవత్యేవ నసంశయః
రుద్రాక్షధారణా దేవ రుద్రో రుద్రత్వ మాప్నుయాత్
యో వా కో వా నరో భక్త్యా ధారయే ల్లజ్జయాపి వా,
సర్వపాపవినిర్ముక్తః సమ్యక్ జ్ఞాన మవాప్నుయాత్"

రుద్రాక్షధారణమువలన రుద్రత్వము వచ్చును రుద్రాక్షను ధరించుటచేతనే రుద్రుడు రుద్రదేవుం డయ్యెను భక్తితో గాని లజ్జతోగాని యెవ్వరు రుద్రాక్షను ధరింతురో వారికి సర్వ పాపములనుండి విముక్తి కలుగును వెంటనే ఆత్మజ్ఞానమును పొందగలరు

ఇంతటితో రుద్రాక్షవిషయము నావచము నీ వడిగిన చందమున నక్షమాలికోపనిషత్తునందు-

"ప్రవాళ, మౌక్తిక, స్ఫటిక, శంఖ, రజతాష్టాపద, చందన, పుత్రజీవి, కాష్ఠ, రుద్రాక్ష, ఇతి ॥
అనికదా యున్నది? వీటియందు తులసీప్రసక్తి లేదు పురాణములందును, స్మృతులయందును తులసినిగూర్చి యీ క్రింది విధముగ చెప్పంబడినది

— తులసీ మణులు —

"రుద్రాక్ష శంఖ పద్మాక్ష పుత్రజీవక మౌక్తికైః
స్ఫాటికై ర్మణిభిః రత్నైః సౌవర్ణై ర్విద్రుమై స్తథా
రాజతైః కుశమూలై ర్వా పచళస్య గృహస్థ స్యాక్షమాలికా ॥
అంగుళీగణనాదేకం రేఖయాష్టగుణం భవేత్ ॥
పుత్రజీవైర్దశగుణం శతం శంఖైః సహస్రకమ్
ప్రవాళై ర్మణిరత్నైశ్చ దశసాహస్రకం స్మృతమ్ ॥

తదేవ స్ఫాటికైః ప్రోక్తం మౌక్తికై ర్లక్షముచ్యతే,
పద్మాక్షై ర్దశలక్షం స్యాత్ స్వర్ణైః కోటి రుచ్యతే ॥
కుశగ్రంథ్యా కోటిశతం రుద్రాక్షైస్స్యా దనంతకమ్,
తులసీకాష్ఠఘటితైః మణిభి ర్జపమాలికా
సర్వకర్మాణి సర్వేషా మీప్సితార్థ ఫలప్రదాః ॥

అని కలదు రుద్రాక్షలు, శంఖములు పద్మాక్షలు పుత్రజీవక మనంబడు తామరపూసలు, ముత్యములు, స్ఫటికములు. మణులు రత్నములు, బంగారుపూసలు, పగడములు దర్భ కణుపులతో జేసెడి పూసలు, అనునవి ఎదునొకంటును, తులసీ పూసలతో గుచ్చిన ఎదిరెండగును గృహస్థులీ ఎదిరెండుమణు లను మాలలుగాచేసికొని వాడుకొనవచ్చును వ్రేళ్ళమీద లెక్కించుచు జపించిన సామాన్యఫలము కలుగును వ్రేళ్ళ కణుపుల మీద లెక్కించిన యెనిమిదిరెట్లుగ ఫలము కలుగును తామర పూసలతో లెక్కించిన పదిరెట్లును శంఖములతో లెక్కించిన నూరురెట్లును పగడములు మణులు, రత్నములతో లెక్కించిన పదివేలరెట్లును, స్ఫటికములతో లెక్కించిన పదివేల రెట్లును, ముత్యములతో లెక్కించిన లక్షరెట్లును, పద్మాక్షలతో లెక్కించిన పదిలక్షలరెట్లును, బంగారుపూసలతో లెక్కించిన కోటిరెట్లును, దర్భపూసలతో లెక్కించిన నూరుకోట్లును, రుద్రాక్షలతో లెక్కించిన అనంతఫలమును, తులసీమణులతో లెక్కించిన సర్వాభీష్టములను ప్రాప్తించును తులసీమాలను సర్వకర్మలయందును నుపయోగించవచ్చును

యః కుర్యా త్తులసీకాష్ఠై రక్షమాలాం సురూపిణీం ।
కంఠమాలాం చ యత్నేన కృతం తస్యాక్షయం భవేత్ ॥

ఎవ్వడు తులసీకట్టెతో జేయబడిన మాలను ప్రయత్న

పూర్వకముగా ధరించునో, దానితో జపించునో అట్టివానిచే జేయబడిన పాపములన్నియు నశించును

ఈ తులసి విష్ణుమూర్తికి చాల యిష్టమైనట్టిది తులసి యెచ్చటనుండునో అచ్చట విష్ణువుండును అందుచేత దులసికి ప్రత్యేక ప్రాధాన్యము కలిగినది

యత్కంఠే తులసీనాస్తి తే నరా మూఢమానవాః ।
అన్నం విష్ఠా జలం మూత్రం పీయూషం రుధిరం భవేత్ ॥

ఎవ్వడు తులసిమాలను కంఠమున ధరించడో వాడు మానవులయందు మూఢుడు వాడు తినెడు అన్నము మలసదృశము. త్రాగు నీరు మూత్రము వంటిది పుచ్చుకొను పీయూషము (పాలు-అమృతము) రుధిరము (నెత్తురు) వంటిది

యే కంఠలగ్న తులసీనళినాక్షమాలా
యే వా లలాటఫలకే లస దూర్ధ్వపుండ్రాః ।
యే బాహుమూల పరిచిహ్నిత శంఖచక్రాః
తే వైష్ణవా భువన మాశు పవిత్రయంతి ॥

ఎవ్వరు తులసీమాలను కంఠమున ధరింతురో మెవరు లలాటఫలకమునందు దూర్ధ్వపుండ్రములను ధరింతురో యెవ్వరు బాహుమూలములందు శంఖ చక్రములను ధరింతురో, వారు వైష్ణవులుగా, పవిత్రులుగా భువనమునందు కీర్తింపబడుదురు

తత స్సర్వేషు కాలేషు ధార్యా తులసిమాలికా ।
క్షణార్ధం తద్విహీనోఽపి విష్ణుద్రోహీ భవే న్నరః ॥

సర్వకాలములందును తులసీమాలికను ధరించి యుండవలెను ఏయొక క్షణార్ధమునందైనను తులసిమాలను ధరించని మానవుని విష్ణుద్రోహిగా యెంచబడును

యజ్ఞోపవీతవద్ధార్యా సదా తులసిమాలికా ।
క్షణమాత్ర పరిత్యాగాత్ విష్ణుద్రోహీ భవేన్నరః ॥

తులసీమాలను యజ్ఞోపవీతముగా నిరంతరమును ధరించవలెను. ఏయొకక్షణమాత్రమైనను దీనిని పరిత్యజించినవాడు విష్ణుద్రోహి యగును.

ఆనందుడా! వినుచుంటివా? వైష్ణవసంప్రదాయమున తులసి కింతప్రాధాన్యము కలిగినది. వైష్ణవ మంత్రజపములకు తులసిమాలయు శైవమంత్రములకు రుద్రాక్షమాలయు, దేవీ మంత్రములకు ముత్యములు, పవడములు, తులసిపూసలు, బంగారుపూసలు గల మాల లుపయోగించవలయునని కొందఱు అనుచుందురు. వైష్ణవులకు తులసిమాల, పద్మాక్షమాల, శంఖమాల, తామరమాల పవిత్ర (దర్భలది) మాలలు పవిత్రములైనవి. వీనియందత్యంతపవిత్రమైనది తులసిమాల. శైవులకు రుద్రాక్షమాల అద్వైతుల కన్నిమాలలును పవిత్రములైనవియె. శైవులకు తులసిమాలయు, వైష్ణవులకు రుద్రాక్షమాలయు నిషిద్ధములని ఆయా మతములవారు చెప్పుచుందురు.

తులసీవృక్షమహిమ అనంతమైనదిగా పద్మపురాణము చెప్పినది.

## తులసీవృక్ష మహిమ

"ఇయం సా న్మహాలక్ష్మీః తులసీ భగవత్ప్రియా ।
తస్మాదిమం నపశ్యంతి వృక్షజ్ఞానేన జైమిని ॥ ౧
యద్వైవ తులసీం మర్త్యో యత్నైవ భువి సేవతే,
తద్వైవ సేంద్రా విబుధాః సేవంతే తాం సురాలయే॥ ౨

పరబ్రహ్మస్వరూపేయం తులసీ యత్ర తిష్ఠతి,
తత్రైవ కుశలం సర్వం సుదృఢం ప్రోచ్యతే మయా॥ ౩
ప్రాప్నోతి మృత్యుకాలే యః తోయం పాతకనాశనం
తులసీపత్రగళితం సయాతి హరిసన్నిధిమ్ ౪
తులసీమృత్తికాపుండ్రం యో మృత్యుసమయే వహేత్,
సముక్తః సకలైః పాపైః పురం గచ్ఛతి చక్రిణః ౫
యస్య హి స్తులసీపత్రం ముఖే శిరసి కర్ణయోః
మృత్యుకాలే ద్విజశ్రేష్ఠః తస్య స్వామీ న భాస్కరిః ౬
యత్రైక స్తులసీవృక్షః తిష్ఠత్యపి చ సత్తమ,
తత్రైవ త్రిదశాస్సర్వే బ్రహ్మవిష్ణుశివాదయః॥ ౭
కేశవః పత్రమధ్యే చ పత్రాగ్రే చ ప్రజాపతిః,
పత్రవృంతే శివస్తిష్ఠే త్తులస్యాస్సర్వదైవహి॥ ౮
లక్ష్మీ సరస్వతీ చైవ గాయత్రీ చండికా తథా
సర్వాశ్చాన్యా దేవపత్న్యః తత్పత్రేషు వసంతిహి॥ ౯
ఇంద్రోఽగ్ని శ్శమనశ్చైవ నైరృతి ర్వరుణ స్తథా,
పవనశ్చ కుబేరశ్చ తచ్ఛాఖాయాం వసంత్యమీ"॥ ౧౦

తులసి సాక్షాత్ శ్రీలక్ష్మియే తులసి భగవంతుడైన శ్రీమహావిష్ణువునకు ప్రియమైనట్టిది ఆకారణమున వృక్షజ్ఞానము కలవారి తులసిని సామాన్యవృక్షముగ భావించరు భూమిమీద మానవు లేవిధముగ తులసిని సేవించుచుండిరో, అదేవిధముగ స్వర్గమునందుండు దేవతలెల్లరును తులసిని సేవించుచున్నారు పరబ్రహ్మస్వరూపిణియగు ఈ తులసి యెచ్చటవుండునో, అచ్చట సర్వక్షేమములు సుదృఢములుగా నుండును మృత్యు

వాసన్నమైనప్పుడు తులసీదళములుండిన నీరును యెవరు పొందు దురో వా రెంతటి పాపులైనను (నరకమును పొందరు) విష్ణు సన్నిధానమును పొందుదురు మృత్యువు సమీపించినప్పుడు తులసి మృత్తికను ముఖమునం దెవ్వరు ధరించునో అతడు సర్వ పాప ములనుండి విముక్తుడై విష్ణువుండిన వైకుంఠపురమును పొందును మరణకాలమునం దెవ్వని ముఖమునందు, శిరస్సు నందు, కర్ణములయందు తులసీదళము (పత్రము) లుండునో, అట్టివానిని యముడు (సమీపించడు) గ్రహించడు ఎచ్చట నొక్క తులసీవృక్ష ముండునో నచ్చట బ్రహ్మవిష్ణ్వాదు లగు దేవసమూహ మంతయు నుండును తులసీపత్ర మధ్యమునందు విష్ణువును, ఆకుచివర బ్రహ్మయును పత్రమూలము (వృంతము-తొడిమి) నందు శివుడును నివసించియుందురు లక్ష్మి, సరస్వతి, గాయత్రి చండికయు నదేవిగముగ నితర దేవపత్నులును తులసీపత్రములం దుందురు ఇంద్రుడు, అగ్ని, యముడు, నిరృతి, వరుణుడు వాయువు, కుబేరుడు మున్నగువారును, ఇతరదేవతలును తులసీశాఖలయం దుందురు

"ఆదిత్యాదిగ్రహాస్సర్వే విశ్వేదేవాశ్చ సర్వదా,
వసవో మునయశ్చైవ తథా దేవర్షయోఽఖిలాః ౧౧
కోటిబ్రహ్మాండమధ్యేషు యానితీర్థాని భూతలే, .
తులసీదళమాశ్రిత్య తాన్యేవ నివసంతి హి ॥ ౧౨
తులసీం సేవతే యస్తు భక్తిభావ సమన్వితః,
సేవితాస్తేన తీర్థాశ్చ దేవా బ్రహ్మాదయ స్తథా॥ ౧౩
ఛిందంతి తృణజాలాని తులసీమూలజానియే,
తద్దేహస్థాం బ్రహ్మహత్యాం హరిర్హరతి తత్‌క్షణాత్ ౧౪

వైశాఖే౽శత ధారాభిః అద్భిర్యస్తులసీం నరః
సించయే త్సో౽శ్వమేధస్య ఫలం ప్రాప్నోతి నిత్యశః ౧౫
కదాచి త్తులసీం దుగ్ధైః సేచయేద్యో నరోత్తమః,
తస్య వేశ్మని విప్రర్షే లక్ష్మీర్భవతి నిశ్చలా ॥ ౧౬
గోమయై స్తులసీమూలం యః కుర్యా దుపలేపనం,
సమ్మార్జనం చ విప్రర్షే తస్య పుణ్యఫలం శృణు॥ ౧౭
రజాంసి తత్ర యావంతి దూరీభూతాని యామిని,
తావత్కల్పసహస్రాణి విష్ణునామోదతే సదా॥ ౧౮
ప్రదీపం యస్తు సంధ్యాయాం స్థాపయే త్తులసీతలే,
సయాతి మందిరంవిష్ణోః కులకోటిసమన్వితః ॥ ౧౯
ప్రభాతే తులసీం పశ్యేత్ భక్తిమాన్ యో నరోత్తమః,
సనిష్ఠధర్మ స వైష్ణవ ఫలంప్రాప్నోతి చాక్షయమ్ " ౦

ఆదిత్యాది నవగ్రహము (సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు బుధుడు బృహస్పతి, శుక్రుడు శనైశ్చరుడు, రాహువు కేతువు)లును విశ్వేదేవత (కాలకాములు, ధురివిరోచనులు, పురూరవార్ద్రివులు)లును, వసువు (ఆపుడు, ధ్రువుడు, సోముడు, అధ్వరుడు, అనిలుడు, ప్రత్యూషుడు, అనలుడు, ప్రభాసుడు) లును మునులు (కశ్యపుడు అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు గౌతముడు, వశిష్ఠుడు, జమదగ్నియు, దేవర్షు (నారదాదు) లును నుందురు

కోటిబ్రహ్మాండములకు మధ్యగానుండిన భూతలము మీద నేయే తీర్థములుకలవో ఆయా తీర్థము లన్నియును తులసీ దళము నాశ్రయించి యుండును ఎవ్వరు భక్తిభావము కల

వారై తులసిని సేవించెదరో వారికి సకలతీర్థములను సేవించిన ఫలము కలుగును. అదేవిధముగ బ్రాహ్మణులను సేవించిన ఫలమును పొందెదరు. తులసీవృక్షముల మూలమునందుండిన తృణము(గడ్డిని)లను యెవ్వరు తీసివేయుదురో వారు బ్రహ్మహత్యాది పాపములనుండి అక్షణమునందే విముక్తులగుదురు. వైశాఖమాసమునందు నీటిధారలతో తులసిని యెవ్వరు తడుపుదురో వారు అశ్వమేధఫలమును ప్రతినిత్యమును పొందుచుందురు. ఉత్తముడైన మానవుడు తులసిని క్షీరములతో నభిషేకించినయెడల అట్టివానికి తరుగనంటి సంపదను లక్ష్మి యిచ్చును. తులసీవృక్షపాదును గోమయముతో నలికి, మొదలునందు నీరుపోసి, మార్జనముచేయువాని శరీరప్రదేశమునందెన్ని రజోకణము (దుమ్మునందలి సూక్ష్మకణములు) లెన్ని కలవో అన్నిసహస్రకల్పములు విష్ణులోకమునందు సుఖము లభించును. సంధ్యాకాలమునందు తులసీవృక్షమువద్ద దీపమును వెలిగించినవారు వైకుంఠమును కులకోటిసమన్వితులై పొందెదరు. భక్తిభావముకలవారు సూర్యోదయకాలము (ప్రభాతము) నందు నిదురలేచిన వెంటనే తులసిని చూచిన విష్ణువును దర్శించినంత ఫలమును పొందెదరు. ఆఫలము అక్షయమైనదిగా నుండును.

"తులసీస్మరణేనైవ సర్వపాపం వినశ్యతి,
తులసీస్పర్శనేనైవ నశ్యంతి వ్యాధయో నృణామ్॥ ౨౧

యోఽశ్నాతి తులసీపత్రం సర్వపాపహరం శుభం
తచ్ఛరీరాంతస్థాయి పాపం నశ్యతి తత్క్షణాత్॥ ౨౨

తులసీకాష్ఠసంభూతాం మాలాం వహతి యో నరః,
తద్దేహే పాతకం నాస్తి సత్యమేతన్మయోచ్యతే॥ ౨౩

తులసీపత్రగళితం యస్తోయం శిరసావహేత్
గంగాయాః స్నానజంపుణ్యం లభతే నాత్ర సంశయః ౨౪
దూర్వాభి రక్షితైః పుష్పైః నైవేద్యైస్తులసీం శుభాం
సమారాధ్య నరోభక్త్యా విష్ణుపూజాఫలం లభేత్ ॥ ౨౫

తులసీ స్మరణమాత్రమువలన సర్వపాపములు నశించును తులసిని స్పర్శించినంతనే సర్వవ్యాధులును నశించును శుభప్రదమైనదియు, సర్వపాపములను నశింపచేయు నదియునైన తులసీదళమును యెవరు భక్షింతురో, వారి శరీరమందుండిన పాపమంతయు నాశనమునందే నశించును తులసీ కాష్ఠము (కట్టెతో) జేయబడిన పూసలమాలలను యే మానవులు ధరింతురో వారి శరీరమునందు దేహపములు నుండవు సత్యము ఇది సత్యము తులసిదళములుండిన నీటిని యెవ్వరు శిరము నందు చల్లుకొనెదరో వారు గంగయందు స్నానమొనరించినంత పుణ్యమును పొందెదరు ఇందెంతమాత్రమును సందేహము లేదు దూర్వము(గరిక)తోను, అక్షతలతోను, పుష్పములతోను నైవేద్యములతోను శుభప్రదమైన తులసిని భక్తితో పూజించిన మానవులు విష్ణుపూజాఫలమును పొందెదరు

ఇదేవిధముగ గారుడమునందును తులసినిగూర్చి చెప్పంబడినది ఆ మాటలను వినుము

"తులసీవిటపిచ్ఛాయా యత్రాస్తి భవతాపహా
తత్రైవ మరణాన్ముక్తి స్సర్వదా దానదుర్లభా॥
తులసీవిటపిస్థానం గృహేయస్య ప్రతిష్ఠతే,
తద్గృహం తీర్థరూపం హి నాయాంతి యమకింకరాః ॥
తులసీమంజరీయుక్తో యస్తుప్రాణాన్ విముంచతి,
యమోస్తం నేక్షితుం శక్తో యుక్తం పాపశతై రపి॥

తత్పాద్యదళం ముఖేకృత్వా తిల దర్భాసనే మృతం
నరో విష్ణుపురం యాతి పుత్రహీనోఽప్యసంశయః ॥

ఎచ్చట భగవంతుని గారవముగ తులసి ప్రతిచ్ఛాయయుండునో అచ్చట మరణించినవారికి సర్వదా నదుర్లభంబగు మోక్షము లభించును

ఎవ్వని గృహమునందు తులసీవృక్ష ముండునో ఆ గృహము తీర్థరూపమైనదగుటంజేసి ఆతావు (గృహము)నకు యమకింకరులు రారు తులసీదళము నుధరించి ప్రాణములు విడిచినవాడెన్నివందల పాపములు కలవాడైనను, వానిని చూచుటకు యముడు శక్తి కలవాడు కాడు తులసీదళమును ముఖము నందుంచికొని, తిలదర్భాసనస్థుడై మరణించిన మానవుడు పుత్రహీనుడైనను విష్ణుపురమును బొందును ఈ విషయమున సంశయములేదు

ఇవ్విధమున వైష్ణవపురాణములం దన్నిటను తులసీ మాహాత్మ్యము చెప్పంబడినది మహా మహిమాన్వితమైన తులసీవృక్షము స్త్రీలకు శ్రీమహాలక్ష్మివంటిది తులసిని పూజించిన స్త్రీలకు శుభములు కలుగుచుండును వైధవ్యము కలుగదు తులసీవృక్షముండిన గృహము సదాచారములతో నిండియుండును ఇందుచేత తులసిపూజల కింతటి మహిమ కలిగినది

శివానంద — గురువుగారు! తులసి కింతటి మహిమ కలుగుటకు బూర్వవృత్తాంతము కలదా? ఉండినచో పూర్వకధను చెప్పి ధన్యునిచేయ ప్రార్థించుచున్నాను

గురువు — శివానందా! ప్రార్థన యెందుకయ్యా! తులసికి పూర్వవృత్తాంతగాధలు పురాణములందు కలవు దేవీభాగవత

తము నాధారముగా జేసికొని తులసీకథను వినుచుందురు వినుము ఈకథకు ప్రధానస్థానము గోలోకమని మందవము

## తులసీదేవి చరిత్రము

ధర్మవంతమైన రాజవంశమునందు ధర్మధ్వజ, కుశధ్వజ అనువారు జనియించిరి వీరు సోదరులు వీరిలో పెద్దవాడు ధర్మధ్వజుడు ఇతడు సంగ్రామధనంజయుడు ధర్మబాంధుడును దేశమంతటిని పరిపాలించుచు ధర్మపత్నితోడను గృహస్థాశ్రమసుఖము లనుభవించుచు నొక్కనాడు భార్యతో గలసి గంధమాదనమునకు వెళ్ళినాడు ఆ పర్వతము సర్వసుఖములకు నిలయము ధర్మమూర్తులకు సంతోషభూమియును ఆ ధర్మధ్వజదంపతులు గంధమాదన పర్వతముమీదగల పూబొదరింట్లయందు పూలతో సెజ్జ లేర్పరచికొని క్రీడించుచుందురు సరస్సులందు జలక్రీడ లాడుచుందురు వేళనతిక్రమించక స్వధర్మానుష్ఠానములను జేయుచుందురు

ఈవిధముగ ధర్మధ్వజుడా నగముమీద సుఖము లనుభవించుచుండగ నాతని ధర్మపత్ని గర్భవతియై శుభలగ్నమునందు చక్కని పుత్రికను ప్రసవించినది ఆ చిన్నారి లక్ష్మీదేవి యంశముతో జనించినదగుటచేత సర్వాంగములు లక్ష్మీవంతము లుగ శోభించుచున్నవి దివ్యమంగళశోభలతో విరాజిల్లుచు సౌందర్యముల నన్నిటిని గ్రహించి యేకమూర్తినిగ – సౌందర్యాధిష్ఠానదేవతగ శ్రీమహాలక్ష్మిగ విరాజిల్లుచుండిన నాపాపకు "తులసి"యని నామకరణము చేసిరి.

తులసి పదునారవరోజునాటికే పదునారుసంవత్సరముల ప్రాయముకల కన్యకవలె మారినది. ఈవింతకు తల్లిదండ్రు లాశ్చర్యమందిరి. జననీజనకుల యనుజ్ఞనొంది శ్రీపతిని భర్తగా కోరి బదరికావనమును ప్రవేశించి, అందొక తావునందు నిశ్చలముగా లక్షసంవత్సరలు తపము చేసినది. తపోకాలమునందాహారవిహారములందు కఠిన నియమముల ననుసరించినది.

తులసీదేవి చేయుచుండిన దపస్సునకు జతుర్ముఖుడెంతయు మెచ్చి, ప్రత్యక్షమై "తులసీ! వరమునీయ వచ్చితివి, కోరుకొనుము నీ మనసులోని భావమును స్పష్టముగా చెప్పు" మనెను.

అంతట తులసి బ్రహ్మకు నమస్కరించి "మహాత్మ దవు, సృష్టికర్తవు, తాతవునైన నీకు దెలియని దేమున్నది? ఇక సిగ్గెందులకు? చెప్పెదను. నే నీ జన్మమున ధర్మధ్వజుని పుత్రికను తులసి అను పేరు కలదానను. నా పూర్వజన్మమున గోలోకమునం దుండుదానను గోపికను కృష్ణునకు బ్రియురాలను. ఒకరోజున రాసక్రీడయందు చతుర్భుజుండైన గృష్ణునితో రతివ్యాజమున సుఖించి, సొమ్మసిలియుంటిని. ఆ సమయమున రాధ వచ్చి శ్రీహరిని గోపముతో జూచుచు నన్ను మానవయోనియందు జన్మింతువని శపించినది. అట్టి సమయమునందు కృష్ణుడు భయముచెందకుము, నీవు భూలోకమునందు నాయంశ గలవాడు, నాలుగుహస్తములు కలవాడు భర్తయగునని అభయమిచ్చి, రాధతో వెడలినాడు. నే నీ లోకమునందు బుట్టి నారాయణుడే పతిగావలయునని తపముచేయుచుంటిని

నాకా హరియే పతియగునటుల వరమును ప్రసాదించుమని యర్థించినది

బ్రహ్మదేవుడి మాటలను విని, తులసీ! వినుము నీవు కోరినటుల నాలుగుభుజములవాడే భర్త యగును పూర్వము గోలోకమునందు నీసౌందర్యమును చూచి ముగ్ధుడై, ప్రణయ భావముతో నిన్ను చూచుచుండిన సుధాముడు రాధాదేవి శాపము చేత యీలోకమునందు దానవరాజుగా జన్మించినాడు అతడు శంఖచూడుడు కృష్ణమంత్రోపాసకుడు కృష్ణాంశగలవాడు అతనిని భర్తగా పొందుము ఈజన్మమునకు రెండవజనియందు కృష్ణుని పతిగా పొందగలవు అతనితో సుఖించగలవు ఇంకను నీవు వృక్షరూపమును బొందెదవు నీదళములు విష్ణుపూజకు వినియోగమగుచుండును నీయందెల్లప్పుడును హరి నివసించి యుండును నీవు మాలికవై హరికంఠము నలంకరించి యుందువు, నిన్ను స్మరించినవారును, నదళములుండిన జలమును పానమొనరించినవారును, నీవృక్షమునుండి వచ్చెడి గాలి సోకినవారును తిరిగి జన్మించరు నీవు వరములిచ్చెడి దేవతవై మానవులచేతను, దేవతలచేతను పూజించబడుచుందువు జరామరణము లుండవు దేవీరూపముగను, వృక్షరూపముగను నుందువు నీకు రాధామంత్రము నుపదేశింతును, జపించుము రాధాదేవి అనుగ్రహము కలుగును, కృష్ణుడు సంగడీడుగ నగును అని తులసికి రాధాదేవిమంత్రమును కవచాదులను నుపదేశించి, విధులను దెలిపి, శంఖచూడు డిక్కడకు గొలది దినములలో రాగలడు అతని వరించుము, సుఖించుము అతనికి సాటి రాగలవా డెవ్వడును లేడనుచు నదృశ్యుడయ్యెను

బ్రహ్మవలన నుపదేశమొందిన రాధాదేవిమంత్రమును తులసి అచ్చటనేవుండి జపించుచుండెను మంత్రము సిద్ధి యైనది అరోజున శ్రీహరిసన్నిధియం దుండినవిధముగ నున్న యది తపముచేత గృశించిన శరీరము కలదయ్యెను జలకము లాడి, సుగంధద్రవ్యము లలందికొని, భుజించి, పూలశయ్యమీద పరుండి నిదురించినది ఆ నిదురయందు శంఖచూడుడు వచ్చి, తనకు మన్మథసుఖము లిచ్చినటులు కలకనినది అతరువాత గొలదిరోజులకు శంఖచూడుడు తులసియున్న వనమునకువచ్చి, తులసీదేవిని చూచి ఆమె సౌందర్యమునకు, తపోప్రభావతేజమున కాశ్చర్యమొందినాడు చిఱునవ్వులతో బలుకరించినాడు "సుందరీ! ఎవ్వరిదానవు? ఒంటరిగా నిచ్చట నెందులకుంటివి? తప మెందులకొనర్చుచుంటివి? లేజవ్వనివైన నీకి ఘోర నియమములేల?" అనినాడు

అకస్మికముగా వచ్చి పలుకరించినవానిని చూచినది సుందరుడు – యవ్వనుడు – తేజోవంతుడు– రాజలక్షణాంకితుడు నైన వానిని మఱలమఱల జూచుచు దలయొంచినది సిగ్గు చెందినది కలలోవానిగా గుర్తించినది లజ్జతోగూడినదై "రాజా! నేను ధర్మధ్వజుభూపాలుని పుత్రికను హరిని పతిగా గోరి తపము సేయుచున్నాను మీ రు త్తములను భావముతో నావిషయము చెప్పితిని మీరెవ్వరు? ఎందులకు వచ్చితిరి? ఒంటరిగానుండిన స్త్రీని చేరదగునా? మీ చరిత్రమును దెలుపుడనినది

అంతట శంఖచూడుడు "సుందరీ! నేను శంఖచూడుడను దానవరాజును బ్రహ్మవరముచేత నిన్ను పత్నిగా స్వీకరించుటకు వచ్చితిని. ఏదీ! హస్తము నిమ్ము గ్రహింతు ననెను

ఈమాటలు వినిన తులసి "రాజా! అగుమాగుము ఇవి యేటిమాటలు! స్త్రీలనునమ్మిన పురుషులు సుఖముగ నుందురా? స్త్రీలు సహజముగ రతిని వాంఛింతురు వారియవసరముతీరినంత బురుషులను తృణీకరింతురు స్త్రీలు కామతృష్ణను దీర్చునంత వఱకు బురుషుని గౌరవింతురు వయస్సును, సౌందర్యమును, పుష్టిని, బలమును చూతురు తుష్టిగలిగెనేని పుష్టిగా పూజింతురు లేనిచొఁ నష్టేటమొంతురు మాస్త్రీల చరిత్రము లియ్యవి మాజాతిని నమ్మకుమని సిగ్గుతో నొయ్యారమునుజూపుచు ముసిముసినగవులతో హెచ్చరించినది

శంఖచూడుడీ మాటలు విని, గోపికా! ఎంతటి మాటలంటివి! దుష్టవర్తనముకలవా రవ్విధముగ నుండవచ్చును రాధ, సావిత్రి, లక్ష్మి, సరస్వతి, దుర్గ - వీరు పవిత్రులుకారా? వీరియంశలచేత జనించిన మండోదరి తార దమయంతి మేనక వేదవతి, అరుంధతి, అహల్య, శతరూప, స్వాహా, దక్షిణ, శచి, ఛాయా, దేవహూతి, రోహిణి, అదితి, వరుణాని వీరు లములు కారా? పండితుడు, నుత్తముడు తేరగావచ్చిన స్త్రీనైనను ముట్టడు నేను బ్రహ్మదేవుని యాజ్ఞచేత వచ్చితిని నీకును నాకును పూర్వజన్మజ్ఞానము కలదు మనము గోలోకవాసులమనుచు నామె అంగీకారమును బడసి, అచ్చోటనే గాంధర్వవిధిగ వివాహ మాడెను వా రనంతములైన సుఖము లనుభవించుచుండిరి కొండలయందును, ఉద్యానవనములందును గుహలయందును, పూదోటలయందును తనివిదీరునటుల క్రీడించుచుండగ నెంతో కాలము గడచినది

అంతటి దీక్షా కాలము ముగించిన శంఖచూడునకు బుట్టుకతో వచ్చిన రాక్షసస్వభావము తొంగిచూచినది. దేవతల రాజ్యములను హరించినాడు. స్త్రీలను చెఱపట్టినాడు. యజ్ఞ భాగములను హరించినాడు. దేవతలు కాకులవలె నలుదిక్కులకు బరువెత్తిరి. కొంతకాల మివ్విధముగ జరిగినంత నీ రాక్షస రాజగు శంఖచూడునకు దేవతలకు యుద్ధము సాగినది. దేవత లపజయములనే పొందుచుండిరి. సురలకు శ్రీహరి ఆలోచనము చెప్పినాడు.

సురలారా! శంఖచూడు దక్షేయుడు. వాని భార్య తులసీ పాతివ్రత్య మాతనిని రక్షించుచున్నది. అంతియుగాక వీడు గృష్ణమంత్రోపాసకుడు. కృష్ణకవచమును ధరించినవాడును. అందుచేత మునుముందుగ కృష్ణకవచమును తొలగించవలయును. తరువాత తులసి పాతివ్రత్యమును భంగము గావించవలయును. అప్పుడుమాత్రమే యతడు గిట్టును. ఈరెంటిని నేను పూర్తి చేయుదును. మీ రని సేయుచునే యుండుడని హితోపదేశ మొనరించినాడు.

మరునాటి యుదయమున విష్ణువు వృద్ధబ్రాహ్మణ వేషము ధరించి, గడగడ వణకుచు, కఱ్ఱను యూతగాగొని, "శంఖచూడుడు కృష్ణుని పూజించి, మంత్రమును జపించి, లేచి, బ్రాహ్మణులకు రత్నములు, వస్త్రములు, ధనములాదిగా గలవి యిచ్చు సమయమునం" దచ్చటకు జేరినాడు. శంఖచూడు డీతనిం జూచి యేమి కావలయునని అడిగినాడు. వృద్ధవేషమునం దుండిన శ్రీహరి హీనస్వరముతో "రాజా! దానవ సార్వభౌమా! చలికి వణకుచు బాధ నొందుచుంటిని. దానమును చేయుటలో

మొదటివాడవగుటచేత నర్థించుచున్నాను నీకవచము నివ్వుము దానిని ధరించి హిమవత్తమునుండి గట్టెక్కెదు ననెను శంఖ చూడుడా వృద్ధునకు వెనుకంజవేయక గృహ్ణిక కవచము నిచ్చెను. దానిని గ్రహించిన విష్ణువు ముసలిరూపముతోనే శంఖచూడుడు గయ్యెను

అంతట శంఖచూడుడు సైన్యములతో బయలుదేరి హిమ గిరియందు సురలతో యుద్ధముచేయుటకు వెడలినాడు ఉభయ వర్గములకును ఘోరు మహాఘోరముగా జరుగుచుండు సమయమున, నారాత్రి కొంతసమయము చనినవెనుక శ్రీహరి శంఖ చూడునిరూపముతో తులసవద్దకువచ్చి ఆమెతో క్రీడించినాడు రతియనంతరము మాతకు తన భర్తగాదని, మోసగాడని గుఱు తించి చివాలున శయ్యమీదనుండి లేచి, కనులెఱ్ఱచేసి నన్ను మోసగించిన నీవెవ్వండవని గద్దించినది

తులసితో చతుర్భుజుండగు శ్రీహరి శంఖచూడుని రూప ముతో క్రీడించుచుండు సమయమునందు - ఆ రాత్రియందు - యుద్ధమునందు నూతనోత్సాహుడైన శంకరుడు విష్ణుపొసంగిన త్రిశూలమును శంఖచూడునిమీదకు విసరినాడు ఆత్రిశూలము రథస్థుండగుచున్న శంఖచూడుని రథముతోసహా భస్మమొనరించినది ఇంతలో విమానమొకటి వచ్చినది దానియందు గోపాలకు డుగామారిన శంఖచూడుడెక్కి గోలోకమునకుం జనినాడు అచ్చట రాధాకృష్ణులు శాపాంతమునందు తమవద్దకు వచ్చిన సుదాముని ఆదరించినారు

విష్ణువు నిజరూపముతో తులసికి గనుపించి, చిఱునవ్వు లతో నిలువబడినాడు ఆ నాలుగుచేతులవానిని - మకర

కుండలమకుటములు స్రవానిని - శంఖచక్రగదాధరునిచూచి నీవు భగవంతుడయ్యును కఠినహృదయుడవై నా శీలమును హరించినందున శిలారూపుడవగుమని శపించినది అయ్యో! భగవంతుని శపించితినేయని బాధయు నొందినది

అంతట శ్రీహరి "తులసీ! నీ శాపమును నవ్వుచు గ్రహించుచున్నాను నీవీ తనువును త్యాగ మొనరించినవెంటనే నీశరీరము గండకీనదిగా మారును ఆనదియందేను సాలగ్రామ పర్వతముగా నుందును నీవు నాకు పత్నివిగ, నన్నిరూపముల యందును నుందువు

నీవీ రూపముతోడనే నన్ను భర్తగాగోరి చిరకాలము తపముచేసితివి గోలోకమునందు నిన్ను జూచి నీపొందుగోరిన సుదాముడు రాధాదేవి శాపమువలన శంఖచూడుడుగా జన్మించి, నిన్నుగురించి తపముచేసినాడు బ్రహ్మదేవుని అనుగ్రహము చేత నాతనికోరిక దీరినది అతడిప్పుడు శంకరుని త్రిశూలము చేత మరణించి, గోపుడై గోలోకమునకుం జేరినాడు నీ తపమునకు నీవు నన్ను భర్తగా పొందితివి మీ యుభయుల కోరికలు నెరవేరినవి

నీవింక తులసీవృక్షరూపమున నుందువు నీ శిరోజములు వృక్షరూపములై మూడులోకములందును పూజింపబడుచుండును దళములు పాపలతావిత్రములగును నాపూజకు నీదళములు ముఖ్యములగును హవ్యకవ్యములందు నీదళములు, దళముల వారి పవిత్రభావమున పూజనీయములగును తులసీదళములను, తులసీమాలలను ధరించినవారింక జన్మించరు నిన్నుపూజించు స్త్రీలు వైధవ్యమనుభవించరు సంతానహీనులు నిన్ను పూజిం

చిన సంతానవంతులయ్యెదరు నీదళములు తినువారు నిరోగులయ్యెదరు

నీవు తులసీవృక్షరూపమునను నదీరూపముననుు దేవీరూపమునను నాకు పత్నివిగా నుండెదవని వరము లొసంగియదృశ్యుడయ్యెను అంతట తులసి యోగముపూని మానవశరీరమును త్యజించి దేవరూపమున దేవియై వైకుంఠమునందు విష్ణువునకు గూర్మిపత్నియైనది శరీరము గండకీనదిగ మారినది నారాయణుడా గండకీయందు సాలగ్రామపర్వతముగా నుండెను ఆ నదియందనేకరూపములతో సాలగ్రామము లుత్పన్నములై పూజనీయము లగుచున్నవి శంఖచూడుని శరీరము సముద్రమునందుబడి, అందుండి శంఖములు పుట్టుచున్నవి శంఖములును దైవకార్యములందు పూజనీయములైనవి

శిష్యానందుడా! తులసీదేవిచరిత్ర మీతీరున నున్నది విష్ణుమూర్తికి భార్యగానుండిన తులసి స్త్రీల కారాధ్యదైవమైనది నమ్మి సేవించినవారికా తులసీవృక్షము కల్పవృక్షముగా నున్నది ఇంతవఱకు నీవు రుద్రాక్షలనుగూర్చియు తులసినిగూర్చియు తెలిసికొంటివి ఇక శంఖములనుగూర్చి వినుము

## శంఖములు

శంఖములపుట్టుకనుగూర్చి తులసీదేవికథలో సూచనగా కలదు శంఖచూడుడు మరణించినతరువాత నాతనిశరీరము సముద్రమునందు పడినది. ఆమహాసాగరము శంఖచూడుని శరీరమును తనయందిముడ్చుకొని, క్రమముగా దానిని శంఖముగా

మార్చినది శంఖచూడుని శరీరము శంఖముగా మారినతరువాత ఆశంఖమునుండి వివిధములగు శంఖము లుద్భవించినవి ఈ శంఖములజాతియందు జనించిన దక్షిణావర్త శంఖము అతిపవిత్రమైనట్టిది దీనినుండి నిరంతరము ప్రణవము వినబడుచుండును బృహద్రూపములుగానుండిన దక్షిణావర్త శంఖములు మఠాచార్యుల పీఠములందును పెద్దదైన భగవదాలయములందును కనుపించును భాగ్యవంతుల గృహములందును అచ్చటచ్చట కనుపించును వీటిని భగవత్సన్నిధియందుంచి పూజించుచుందురు. రెండవరకము సామాన్యమైనది ఉత్తరముఖముగా సుడులు తిరిగియుండును. ఇట్టివి అన్నిచోటులందును కనుపించును పరిమాణమునందనేకరూపములుగా నుండును పెద్దవి చిన్నవి, చాలాచిన్నవి వీటియందుత్తమమైన శంఖములను రాజు లుపయోగించెదరు వాటిలక్షణములనుబట్టి పేరు లుండును మహాభారతయుద్ధమునందు పాండవులు, కృష్ణుడు వాడిన శంఖముల పేరు లీవిధముగా నున్నవి

"పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః ।
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మావృకోదరః ॥
అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః ।
నకులస్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ ॥"

(గీత 1-15, 16)

శ్రీకృష్ణుడు పాంచజన్యమును, అర్జునుడు దేవదత్తమును భీముడు పౌండ్రకమును, ధర్మరాజు అనంతవిజయమును, నకులుడు సుఘోషమును, సహదేవుడు మణిపుష్పకమును" యీ పేరులుగల శంఖముల నుపయోగించుకొనిరి విష్ణుమూర్తి

హస్తమునందుండిన శంఖము పాంచజన్యము పాండవులేగాక తక్కిన రాజులెల్లరును శంఖము లుపయోగించుకొనిరి విజయ ధ్వనులకీ శంఖము లూదెదరు శివాలయములందును విష్ణ్వా లయములందును శంఖములు కలవు అద్వైతుల పంచాయతన దేవతార్చనలయందును శంఖపూజ కలదు

ఈ శంఖములం దుత్తమ మధ్యమ అధమ అధమాధ మములగునట్టివి కలవు ఉత్తమశంఖములకుండగిన లక్షణము లనుబట్టి శంఖముల పేరులు నిర్ణయింతురు తెల్లశంఖములను విశేషముగా పూజింతురు తెలుపుయెరుపులు కలసిన రంగుకల శంఖములును ముండ్లుకలవి, విరూపలక్షణము లున్నవి ఊర్ధ్వ సనకలవి, కొమ్ములుండినవి, పగిలినవి విరిగినవి పూజార్హములు కావని చెప్పుదురు శంఖజాతికి చెందిన ముత్తెపుశంఖము లందు చాలచిన్నవియు కలవు వాటిని మాలలుగ చేసికొని ధరించవచ్చును జపములకు నుపయోగించవచ్చును మంచి శంఖములు శుభములు కలిగించును వైష్ణవమతమునందలి మహిళలు శంఖములను బంగారముతో పొదిగించి మాలలుగా చుట్టించుకొని కంఠమునందు ధరించుచుందురు వీటిని ధరించిన వారు మంచిమనస్సుకలవారుగను తేజోవంతులుగను కనుపించు చుందురు

సంగీతవిద్వాంసులీ శంఖమునందు సప్తస్వరములను పలి కించుచు మనోహరముగ సంగీతమును వినుపించుచుండిరి పూర్వమునుండియు వాయిద్యములందు "శంఖవాద్య" మనున దొకటి గలదు

శంఖమాలచే జపించిన జపము పూర్ణఫలమీయదు కాని వేయిగుణముల ఫలము కలుగును శంఖములు సముద్రము

నందు జనించినవిగనుక పవిత్రములైనవి తులసీ సంబంధములైనట్టివగుట విష్ణువునకు ప్రీతిపాత్రములునైనవి శుభమతి ప్రభావముకలది వైష్ణవులతిగా స్తుతింతురు.

శ్రీమహావిష్ణుదేవుని వామహస్తమునందుండిన పాంచజన్యము విష్ణువునోటియందుండి ధ్వనిచేయుచుండగా ఆ ధ్వని ప్రభావముచేత దానవులదర్ప మడంగుచున్నదను భావములతో పంచాయుధ స్తవమునందు పాంచజన్యస్తుతి కలదు. దానిని విని శంఖమును నమస్కరించుము.

"విష్ణోర్ముఖోత్థానిల పూరితస్య
యస్య ధ్వని ర్దానవదర్పహంతా ।
తం పాంచజన్యం శశికోటి శుభ్రం
శంఖం సదాహం శరణం ప్రపద్యే ॥"

శిష్యా! నమస్కరించితివా? ముత్యముల వృత్తాంతమును వినుము ముచ్చటపడుము

## ముత్యములు

ముత్యములు సామాన్యముగా సముద్రమునందును, మదించిన యేనుగుల కుంభస్థలములందును పుట్టునని చెప్పుచుందురు ఇంకను యీముత్యములు మేఘములందును సర్పముల శిరస్సులందును బాగుగా ముదిరిన వెదురుబొంగులయందును మహాబలిష్ఠములైన మత్స్యముల శిరస్సులయందును చెఱకుగడలకణుపులందును, శంఖములందును, సముద్రతీరప్రాంతములయందును, బలిసిన అడవిపందుల కోరలందును ముత్తెపు చిప్పలయందును పుట్టుచుండునని పూర్వగ్రంథములందును "రత్న

పరీక్ష, రత్నశాస్త్రము" అందును, జ్యోతిషగ్రంధములందు వ్రాయబడియుండుట అందరు నెఱింగినదియె

ఈముత్యములను క్షీరాబ్ధి, గాంబుమంటి, ముత్తైము చిప్పముత్తెము, ఇషటము, కాకపాణి అంబుమణి లేక అంబుపూస, నీరటము, మంజరి, శుద్ధముత్యము, గొగ్గి ఇప్పాణి యను పేరులతో బిలుచుచుందురు సముద్రమునందుపుట్టినవి గ్గ ములు, చెఱకుగడలనుండిపుట్టినవి ఇషటములు చిప్పలనుండి పుట్టినవి చిప్పముత్యములు, మేఘములనుండి పుట్టినవి నీరటము లని వాటివాటి జన్మస్థానములనుబట్టి ఆయా పేరులతో బిలువం బడుచుండును

పాములనుండిపుట్టినవి యెఱ్ఱగానుండి ప్రకాశవంతములై మనోహరములుగ కన్పించుచుండు ను ఈముత్యములు విషము లను హరించునట వెదురుబొంగుల కణుపులందుపుట్టినవి మాషగింజలంతగానుండి నక్షత్రములవలె ప్రకాశించుచుండును వీటినిధరించుటచేత స్త్రీవశ్యము సంభోగసుఖము మనస్సున కుల్లాసమున్నగునవి కలుగును చేప(గండుమీను)లశిరము లపైబుట్టినవి మల్లెపుష్పలవలెను శుభ్రమైన రజితమువలెను నుండును వీటినిధరించిన అగ్నిభయము లేదు ఏనుగులకుంభ స్థలమునందుపుట్టినవి పెద్దవుసిరికకాయలవలె నుండును వీటిని మహారాజులు ధరించెదరు ఈముత్యములు సామ్రాజ్యలాభమును భోగభాగ్యము లిచ్చును చెఱకుగడలనుండిపుట్టినవి తెల్లని పుష్పమువలెనుండును రాజవశ్యముకోరువారు వీటిని ధరించె దరు కిటి(పంది) కోఱలనుండిపుట్టినవి రేగుపండంతప్రమాణ ముగానుండి, యెఱ్ఱనిరంగులో శోభించుచుండును వీటిని రాజుల

కిరీటములందు స్థాపించెదరు వీటిని ధరించినవారు ధైర్యసాహసములను మహోన్నతమైన సంపదలను పొందెదరు శంఖములనుండి జనించినవి మంత్రసిద్ధులను కలిగించును తెలుపు రంగుతో తళతళ మెరయుచుండును "శృంగణ, రావణ, తామ్రపర్ణి" అను నదులయందుండెడి ముత్యపుచిప్పలనుండి పుట్టినవి వ్యవహారములందు రాజకీయములందు విజయమును సమకూర్చును స్వాతికార్తెలో స్వాతిచినుకులు ముత్యపుచిప్పలయందు పడును అందుండి జనించిన ముత్యములు ధవళవర్ణముతో నుండును ఇవి ప్రశస్తమైనవి వీటిని కంఠములందు ధరించవచ్చును జపమాలలుగా నుపయోగించవచ్చును ఈ చిప్పలయందే పెద్దముత్యములును ఎందును వీటిని మహామౌక్తికములని యందురు ఇవి యున్నచోట ధన దరిద్ర ముండదు తరుగని ఐశ్వర్యమును భోగములు ననుభవింతురు

ముత్యములందును దోషములు కలవి యుండును ముత్యములను పరీక్షించువారు దోషములను చెప్పగలరు సామాన్యముగ ముత్యములను పరీక్షించువారు గోమూత్రమునందు స్వల్పముగ లవణము కలిపి, దానియందు ముత్యములను కొంతసేపుంచి పిదప ధాన్యపుపొట్టుతో తోమినయెడల పగలరాదు మరికొంత తేటన్ను రావలయును ఇట్టి ముత్యమును మంచిదిగ నిర్ణయింతురు

ముత్యమున కధిదేవత చంద్రుడు చంద్రుడు మనస్సునకు కారకత్వము కలవాడు మతిభ్రమణ మున్నవారు వీటిని ధరించుచుండిన మతిభ్రమణము తొలగును కన్యలు ధరించిన కల్యాణములగును మనస్సు పరిశుద్ధముగ నుండును కొన్ని

వ్యాధులు నివారణయగును దంపతులమితముగా దాంపత్య సుఖము అనుభవింతురు ముత్యముల భస్మము నరించి అనేక వ్యాధులమీద వాడెదరు అన్నవస్త్రములకు లోటుండదు కష్టములు నివర్తించును

శిష్యుడా! బహువిధముల సుఖములిచ్చు ముత్యముల మాలతో జపములోచరించిన లక్షగుణముల ఫలిత మొసగూడును స్త్రీపురుషులందరును నిరంతరము వీటిని కంఠములందు ధరించ వచ్చును ఇక పగడముల వృత్తాంతమును వినుము

## పగడములు

పగడము లనబడు పగడములు సముద్రప్రాంతము లందును, సముద్రమధ్యమందుండిన లంకలయందును పుట్టు చుండును పగడపు పురుగుల మలమునందుండి యివి జన్మించును సముద్రములు కాక సమృద్ధిగ నీరుండెడి పర్వతప్రాంతము లందును, అడవులయందును పగడముల పురుగు లుండును ఆ పురుగులుండినచోటులందే పగడము లుండును ఈ పగడములు పొడవుగను గుండ్రగను నుండి యెఱ్ఱనిదొండపండువలెను, బాగుగా పండిన మట్టిపండువలెను, చిలుకముక్కు రంగువలెను నుండును అతిమనోహరముగ కనుపించుచుండును పగడములు ధరించినవారికి సర్వకార్యములందును శుభములు జరుగుచుండును ఎఱుపురంగు ప్రభావమువలన జనవశీకరణశక్తి కలుగును వీటిని ధరించుటచేత కొన్నివ్యాధులును తగ్గును

పగడమున కధిదేవత కుజుడు జాతకరీత్యాగాని, గోచారమువలనగాని కుజుడు దుష్టఫలము లిచ్చుచుండినయెడల

పగడపుమాలను ధరించిన కుజుని యొక్క దుష్ఫలములు తగ్గును ఋణబాధలు కలవారు భూస్వాములు, వివాహములు కానివారు కోర్టు వ్యవహారములు కలవారు యీమాలలు ధరించి కుజుని స్తుతించిన శుభము లందగలరు జగన్మాత లలితా దేవి యొక్క పురాణము కలది ఈమాలతో లలితా దేవిమంత్ర మును జపించిన కోరినకోరిక లీడేరును

ఈ పగడములందు బ్రాహ్మణులయందుండినట్టుల నాలుగు జాతులు కలవు ఎండదేటిరక్తమువంటిరంగుకలిగి పైభాగము నునుపుగనుండినట్టిది బ్రాహ్మణజాతికి చెందును తేలికగనుండి మనోహరముగ ప్రకాశించుచు గంగసింధూరమువంటి రంగును సమానవృత్తము కలిగిగాని చిక్కని మృదువైన పురంగు కలిగి గాని యుండును సునునుపైనచమురుకలిగినట్టిది క్షత్రియజాతికి చెందును మోదుగపువ్వువంటి రంగుకలిగినది వైశ్యజాతికి చెందును మలినమైనట్టిది, తేజస్సులేనట్టిది, యేమాత్రమును కఠినమైనట్టిది శూద్రజాతికి చెందును కనుక నానావర్ణములవా రాయారంగులుగల పగడములు ధరించి శుభఫలములను పొంద వచ్చును

పగడములు కొన్నిచోట్లలందు పురుషలందుపుట్టినవాటి నుండి చిన్నచిన్నముక్కలుగమారి పెద్దముక్కలుగ విస్తరిల్లి అతిపొడవుగల రంధ్రములుండిన కాడలుగ పెరుగుచుండును

దోషములులేని శుద్ధమైన పగడములనే ధరించవల యును ఇట్టివాటితోడనే జపించవలయును ముత్తైదువులీ పగడ ములు ధరించిన దీర్ఘకాలసౌమంగల్యము. సంతానలాభములు పొందగలరు కుటుంబమునందు తరచుగాసంభవించెడి గృహ

కల్లోలములు తగ్గును వ్యాపారము చేయువారికి ఎవరికను కల్ప వృక్షమువంటిది ఈమాలతో శుజుడు లక్ష్మీగణపతి, లలిత, లక్ష్మి, దుర్గ, కామేశ్వరివంటి మంత్రములను జపించిన సద్య స్ఫలమునందే కొన్ని ఫలములను పొందుదురు ఎంచిన తరువాత మాలను కంఠమున ధరించరాదు కుంభమాలతో జపించరాదు ఈ నియమ మన్నిమాలలకును వర్తించును పగడములు మణులు రత్నములమాలలతో జపించిన పదివేల గుణముల ఫలమును పొందును ఇంక స్ఫటి కమునుగూర్చి తెలుసుకొం

## స్ఫటికములు

స్ఫటికమణులు పుట్టునవి కావు స్ఫటికపురాయి భూమి యందుండును చిన్నచిన్నగుట్టలుగను ఉండును భూమియం దుండినదియు మిట్టరూపముగ నుండునట్టిదియు పలుచరాయివలె కనుపించును ఈరాతిని సానమీదబెట్టి సానబెట్టినకొలదియు శుద్ధముగ మారును అవిధముగ మారినదానినుండి వివిధకోణ ములుగల మణులను తయారుచేయుదురు బాదంకాయవలెను, గుండ్రముగను, చతుష్కోణ, షట్కోణ, అష్టకోణములుగను సానమీదనే రూపులు దిద్దుదురు రంధ్రములను వేయుదురు ఈ స్ఫటికముతో శివలింగములను, వివిధములైన దేవమూర్తులను సృష్టిచేసి, వారికష్టములకుందగురీతిగ ధరలుంచి విక్రయింతురు

శివుడు శుద్ధస్ఫటికస్వరూపుడు. "శుద్ధస్ఫటికసంకాశం" అని మహాన్యాసమునందు కలదు పురాణములు వేదము లిట్లే

చెప్పినవి శుద్ధస్ఫటికమునకు రంగును నిర్ణయించలేక తెలుపు వర్ణమనిరి ఇది తెలుపుకాదు అతినిర్మలమైనది శుద్ధమైన గంగాజలమువంటి రంగుయందుండును ఇట్టి రంగుకలిగిన శుద్ధస్ఫటికమాలను శివరూపముగా ధరించవచ్చును మాలతో జపించవచ్చును ఈమాలతో జపించిన పదిపేలగుణముల ఫలమును పొందును

## కుశపర్వములు

కుశలనగా దర్భలు ఈదర్భలు విష్ణుభగవానుడు తన శరీరరోమములనుండి పుట్టినవని గారుడమునందు గరుత్మంతునితో చెప్పియున్నాడు

"దర్భావిభూతి ర్మే తార్క్ష్య మమరోమ సముద్భవాః,
అత స్త త్పూర్శనా దేవ స్వర్గంగచ్ఛంతి మానవాః ।
కుశమూలేస్థితో బ్రహ్మా కుశమధ్యే జనార్దనః,
కుశాగ్రే శంకరోదేవ స్త్రయోదేవాః కుశే స్థితాః ॥

గరుత్మంతుడా ! దర్భలను యమభటులు చూచి, అవి నా శరీరమునుండి పుట్టినవిగనుక నావిభూతిగా భావించి బిరిగి వెళ్ళెదరు దర్భమూలమునందు బ్రహ్మయు, మధ్యయందు జనార్దనుండును, అగ్రమునందు శంకరుడును నివసించియుందురు త్రిమూర్తులుండిన దర్భ అతిపవిత్రమైనవి

దర్భలు స్త్రీపురుషనపుంసకములని మూడువిధములుగా నున్నది మూలము (మొదలు) సన్నగానుండి, మధ్యభాగము నుండి క్రమక్రమముగా చివరవరకు లావుగానుండినది చరుచు

దర్భ మొదలునుండి చివరవరకు నొకేవిధముగా నుండునది స్త్రీదర్భ మొదలు లావుగానుండి క్రమముగా సన్నబడుచు జివర కతిసన్నముగానుండినది నపుంసకదర్భ దీనినే "తెల్లు" అని యందురు త్రివిధములుగానుండిన యీ దర్భలయందు పురుషదర్భయే శుభాశుభకార్యములయందును, శ్రౌతకర్మల యందు నుపయోగింపబడుచున్నది స్త్రీనపుంసకములు నిషిద్ధము లని విజ్ఞు లనుచుందురు

పురుషదర్భతు సంబంధించిన కణుపులయందుండిన కణుపు లుండునట్లుగ చిన్నముక్కలుగ చేసికొని రంధ్రములు వైచి, యజ్ఞోపవీతముల కుపయోగించెడి నూతనదారముతో గుచ్చి మాలగామార్చి యీ కుశగ్రంధినే మేరువుగా సంధించి పూర్వ మంత్రములతో నభిమంత్రించి, జపముకు కుపయోగించుకొనవలెను ఈకుశపర్వమాల పురుషులకు మాత్రమే యుపయోగ పడును ఈకుశగ్రంధిమాలతో చేసిన జపము కోటిరెట్లు ఫల మిచ్చును సంక్రమణములయందు గ్రహణములయందు, పూర్ణిమా మావాస్యలయందు దీనితో జపించుట శిష్టజనాచారమని బుద్ధిమదగ్రగణ్యు లనుచుందురు

## పద్మాక్షలు

పద్మములు లక్ష్మీదేవికి ప్రీతిపాత్రములైనవి పద్మము నందు శ్రీమహాలక్ష్మి నివసించియుండుటను శ్రీసూక్తము చెప్పుచున్నది

"పద్మేస్థితాం పద్మవర్ణాం తామిహోపహ్వయేశ్రియమ్", "పింగళాం పద్మమాలినీమ్" "స్వయం శ్రీదేవిదేవతా, పద్మా

ననే పద్మఊరూ పద్మాక్షీ పద్మసంభవే, త్వం మాం భజస్వ పద్మాక్షీ", "పద్మప్రియే పద్మిని పద్మహస్తే పద్మాలయే పద్మదళాయతాక్షీ। విశ్వప్రియే విష్ణుమనోఽనుకూలే త్వత్పాదపద్మం మయి సన్నిధత్స్వ ॥ యా సా పద్మాసనస్థా విపులకటితటీ పద్మపత్రాయతాక్షీ। గంభీరావర్తనాభి స్తనభరనమితా శుభ్ర వస్త్రోత్తరీయా, లక్ష్మీ ర్దివ్యై ర్గజేంద్రై ర్మణిగణఖచితై స్స్నాపితా హేమకుంభై ర్నిత్యం సా పద్మహస్తా మమ వసతు గృహే సర్వమాంగళ్యయుక్తా"

ఇత్యాది గజలక్ష్మీ వర్ణనము "లక్ష్మీదేవి కన్నులు పద్మములు ఊరువులు పద్మములు పద్మాసనమునందు కూర్చుండి యున్నది హస్తమునందు పద్మమును ధరించినది" అను విశేషణములనుబట్టి లక్ష్మియే పద్మముగను పద్మమే లక్ష్మిగను తెలియుచున్నది

సరస్సులందును, చెఱువులయందును, దొరువులయందును పద్మము లుండును. పద్మములపూవులతో శ్రీమహాలక్ష్మిని పూజింతురు. పూరేకులు పదులు వందలు, వేలుగా నుండును "సహస్రదళ పద్మము"లును కలవు. పద్మములందు తెలుపు, ఎరుపు, పసుపువర్ణములు కలవి కలవు. పద్మములయందు పూవున కాధారముగా పూసవంటిది యుండును. పూరేకులను తొలగించి పచ్చిగానుండిన పూసలనుయెండించి, రంధ్రములు పైచి, దారమునకు గుచ్చిన మాల యగును. ఇదియే పద్మాక్షమాల. ఏరంగు గల పద్మపూసలను గ్రహింతురో, అయ్యవి యెండినను ఆరంగు కలవిగనే యుండును. మూడువర్ణముల మణులును మాలలకు పనికివచ్చును

ఈపద్మాక్షమాల శ్రీలక్ష్మీరూపముగాన విష్ణుమంత్రములకు, శ్రీలక్ష్మీమంత్రములకు, శ్రీలలితామహామంత్రములకు, లక్ష్మీగణపతిమంత్రములకు, సూర్యచంద్రుల మంత్రములకు నుపయోగించిన మేలైన శుభఫలములు లభ్యమగును కంఠమునందును ధరించవచ్చును ఈమాలతో చేసినజపము పదిలక్షల గుణముల ఫలము లభ్యపడును

## తామరలు

తామరలను కలువలనియూ ఎలుతురు ఇవియును దొనలు సరస్సులు, చెఱువులందే యుండును పద్మములవలె తెలుపు ఎరుపు, పసుపు - ఇంకను మరికొన్ని రంగులతో యుండును పూవునకు మొదట పూస యుండును పద్మమునకు చేసినవిధము గనే వీటిని మాలలుగా చేసికొని జపముల కుపయోగించ వచ్చును కంఠములందును ధరించవచ్చును తామరపూవులతో స్త్రీదేవత లందరిని పూజించవచ్చును ఈతామరమాలలు శైవ వైష్ణవాదిమతముల కతీతముగా నుండినవి అందరు నుపయోగించుకొనుచున్నారు తామరపూలతోజేసిన జపము ఎదిరెట్లు ఫలముమాత్రము లభ్యమగును.

తామరలకు "పుత్రజీవి" యను పేరును కలదు ఇందుండిన ఎచ్చిపూసలను సంతానములేనివారు ప్రతినిత్యము దినమున కొక్కటి లేదా రెండుచొప్పున ప్రాతఃకాలమునందు తిని ఉష్ణ గోక్షీరములను త్రాగవలెను ఈవిధముగ కొంతకాలము సేవించిన సంతానము కలుగును ఇందుచేతనే యిప్పటి "పుత్ర జీవి" అని పేరొందినది

ఇదేవిధముగ విత్తినములుండిన బాగుగా ముదిరిన తులసీ చెట్టును సమూలముగ నీడయందు యెండబెట్టి, చూర్ణమొనరించి పాలయందు అరతులంచూర్ణమును కలిపి రెండుపూటలయందును పుచ్చుకొనుచుండిన సంతానము కలుగును అనేక రోగముల మీద తులసి పనిచేయును

## బంగారు పూసలు

సువర్ణములయొక్క పవిత్రతను చెప్పుట యెవ్వరికిని సాధ్యముకాదు అందుచేత పూర్వులు బంగారమును గూర్చి—

"స్వర్ణం పవిత్ర మమలం స్వర్ణం పాపప్రణాశనం।
స్వర్ణం హి శంకరం—"

అని ఘంటాపథముగ చాటిచెప్పినారు స్వర్ణమాలతో జపించిన కోటిరెట్లుఫలము కలుగును. స్త్రీపురుషులెల్లరును స్వర్ణ మాలలను ధరించవచ్చును. స్వర్ణమాలధారణచేత అనేక విధములగు రుగ్మతలు తొలగును వైద్యమునందు దీని ప్రాశస్త్యమునుగూర్చి విపులముగా కలదు వేదములు, పురాణములును ప్రశంసించినవి

## వెండి పూసలు

బంగారమువలె నిదియు ప్రత్యేకస్థానము సంతరించుకొనినది వేదశాస్త్రములీ రజితమును కీర్తించినవి కనుక, రజితమాలతో చేసిన జపము దాదాపు స్వర్ణమాలయిచ్చినంత ఫల మీయవచ్చును

# చందన మాలలు

చందనవృక్షము లనగా గంధపుచెట్లు. ఇవి రెండు విధములుగా నున్నవి. అందరును వాడునట్టి గంధపుచెట్టును "శ్రీవృక్షము" లనియు "శ్రీచందన వృక్షము" లనియు నందురు. శ్రీవృక్షమనగా "బిల్వవృక్ష" మని పురాణములందు కలదు. ఇది తెల్లచందనము. రెండవది రక్తచందనము. ఈ రెండువృక్షముల నుండియు పూసలను తయారుచేయుదురు. మాలలుగాను, ఎంతో రింతురు. దేవవిగ్రహములను, ఇతరములైన వస్తువులను తయారుచేయుచుందురు. మైసూరురాష్ట్రమునందీ వృక్షములు విశేషముగ కలవు. ఇట్టి వృక్షములనుండి తయారుచేయబడిన చందనమాలలు జపములకు పనికివచ్చును.

శ్రీచందనవృక్షము లక్ష్మీరూపమనియు, రక్త చందన వృక్ష మాదిత్యరూపమనియు చెప్పుదురు. శ్రీగంధ మన్నికార్యములందును నుపయోగింపబడుచున్నది. రక్తచందనగంధము సూర్యోపాసనయందు వినియోగ మగుచున్నది. చందనగంధ ప్రశంస —

"గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాః కరిషిణీం। ఈశ్వ
రీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయేశ్రియమ్"

అని వేద, పురాణ, స్మృతులయందు కలదు.

చందనమాలధారణవలన దేహతాపము తొలగును. మనస్సునకు శాంతి కలుగును. ఉల్లాసము జనించును. అనేక వ్యాధులమీద చందనతైల ముపయోగించబడుచున్నది.

# మణులు - రత్నములు

మణులు రత్నములు భగవద్రూపములుగా నుండిన పర్వతశిలలనుండి హెచ్చుగా పుట్టుచుండును భూమినుండియు, భూశిలలనుండియు సముద్రాంతర్భాగములనుండియు మూగలుగ జనించును, సానలమీద మూగవిగ నుండినవానిని బాగుగా నరుగదీసినప్పుడు మణులుగ రత్నములుగ మారుచుండును సానమీద యెంత హెచ్చుగ దొరపిడిపడిన నంత హెచ్చుగ కాంతి గలవిగ మారుచుండును మణులు మహారాజులవద్దకు చేరుచుండును మణులు సామాన్యుల కందుబాటులో నుండునవి కావు విశేషముగ దేవలోకములందే యుండును తరువాత మహారాజులకంఠములందు కిరీటములందును యుండును ఇట్టి మణులపూర్వములగుటచేత వినియున్నవారు కడుదొడ్డవారుగ నుందురు మణి మహామహిమోన్నతమైనట్టిది, ఈ సందర్భమున సత్యభామతండ్రికి సూర్యభగవాను డొసంగిన "సూర్య మణి" కథను గుర్తుచేసికొనిన మణియొక్క, మణులయొక్క గొప్పతనము కొంత దెలియును

ఇక రత్నముల ప్రభావము నిట్టిదియె నవరత్నములను మాలగా చేయించుకొని భాగ్యవంతులు ధరించుచుండుట మనము చూచుచున్నాము కదా! నవగ్రహములకు నవరత్నములకు సంబంధము కలదు ఆ బాంధవ్యములను వినుము

1 కెంపు లేక మాణిక్యము, 2 ముత్యము, 3 పగడము, 4 పచ్చ, 5 పుష్యరాగము, 6. వజ్రము, నీలము, 8 గోమేధికము 9 వైడూర్యములను పేరులతో నవరత్నములుండును

1 సూర్యునకు కెంపు, 2 చంద్రునకు ముత్యము, 3. కుజునకు (అంగారకుడు) పగడము, 4 బుధునకు పచ్చ 5 బృహస్పతికి పుష్యరాగము, 6 శుక్రునకు వజ్రము, 7 శనికి నీలము, 8 రాహువునకు గోమేధికము 9 కేతువునకు వైడూర్యము ఇవ్విధమున రత్నములతో గ్రహములసంబంధ ముండును ఏ గ్రహముతో చెందిన రత్నము కలదో ఆ రత్నమున కాగ్రహము ప్రైవమగును అందువలన నాయా గ్రహములు దుష్టఫలము లిచ్చుకాలమునందా రత్నములను ధరించిన శుభఫలములు పొందుదురని త్రికాలజ్ఞులగు జ్యోతిఃవేత్తలు జ్యోతిశ్శాస్త్రములందు చెప్పిరి పురాణములందును యీ విషయములు దృగ్గోచరము లగుచుండును వీటివివరణ యీతీరుగ కనుపించెదిని

1 కెంపు - ఇది సూర్యునకు ప్రీతిపాత్రమైనది దీనిని మాణిక్యము, పద్మరాగమనియు పిలుతురు నవగ్రహములకు సూర్యుడు రాజుగానుండినటుల నవరత్నములకీ కెంపు అట్టిది ఇంకను దీనిని కెంపుమణి, మాణిక్యమణి పద్మరాగమణి" అనియు నందురు దీనియం దారువిధములగు భేదములుండెనని రత్నపరీక్షకులు చెప్పుచుందురు, 1 పద్మరాగము, 2 సౌగంధికము 3 కురువిందము, 4 మాంసగంధి 5 నీలగంధి, 6 లాలుగంధి వీటికుండిన రంగులనుబట్టి యీ పేరులు వచ్చినవి

1 సూర్యోదయరంగువంటి రంగుకలది పద్మరాగము 2. దానిమ్మ పూవు వంటి రంగు కలది సౌగంధికము కము, 3 కోకిలనేత్రపుమెరుపువంటి రంగుకలది కురువిందము,

4 కుందేలు మాంసమువంటి రంగుకలది మాంసగంధి, 5 ఎరుపు నలుపురంగులమిశ్రమరంగువంటిది నీలగంధి, 6 ఎరుపుతెలుపు రంగుల మిశ్రమరంగువంటిది లాలుగంధి కెంపు లక్షణములీ తీరున కలవు

2 ముత్యము – ఇది చంద్రున కిష్టమైనట్టిది దీనిని గురించి యింతకుముందే వినియుంటివి

3 పగడము – ఇది అంగారకునకు చెందినది దీని వివరణయు ముందే వినియుంటివిగదా।

4 పచ్చ – దీనిమీద బుధున కభిమానము మెండు 1 మరకతము, 2 తృణగ్రాహి, 3 హరిన్మణి, 4 గారుడంబను పేరులును పచ్చకు కలవు

ఆకుపచ్చవంటి రంగుకలిగినందున నాకుపచ్చ యనంబడినది నెమలిగొంతుక్రిందనుండెడి ఆకుపచ్చవలెను నుండును చిలుకరెక్కల రంగువలెను, పాలచెట్టుకొమ్మరంగుయందును పచ్చయుండి తళతళ మెఱయుచుండును దీనిని ధరించినవారికి బుధుడు బుద్ధిబలమును ధనమును నిచ్చును భూతప్రయోగములనుండి విముక్తులయ్యెదరు ఉన్మాదము తొలగును అనేక రోగములును నివృత్తియగును

మంచిపచ్చను ధరించనిచో మచ్చ కలిగించునని చెప్పుదురు పరీక్షించి గ్రహించుట మంచిది.

5 పుష్యరాగము పుష్యరాగమున కధిదైవము బృహస్పతి పుష్యరాగమును ధరించినవారినిగురుపు కాపాడుచుండును

దీనికి "కనక పుష్యరాగము గురురత్నము, పుష్యమి, శ్వేత మణి" యను పేరులు కలవు

నిర్మలమై నునుపుగ నుండునది శ్వేతపుష్యరాగము బంగారువర్ణములో నున్నది కనక పుష్యరాగమగును గోగు పువ్వురంగులో నుండినది శ్రేష్ఠమైనట్టిది ఎఱుపు, నీలము రంగుల యందును నుంటును బృహస్పతి కనకవర్ణముంం దుండును అందువలన కనకపుష్యరాగమును ధరించుట మంచిది దీనిని ధరించిన శుభములు కలుగును

పుష్యరాగమునందును నాలుగురకములు కలవు తేనె వంటిరంగు తెలుపురంగు కలసిన మిశ్రమరంగు కలది బ్రాహ్మణ జాతిది ఎఱుపుతెలుపుకలసినది క్షత్రియజాతిది పసుపునీలము కలసినది పై శ్యజాతిది నిలము అధికముగ కలది శూద్రజాతిది,

పుష్యరాగమును ధరించినవారికి శత్రుబాధయుండదు సంతానములేనివారు గురువును పూజించి కనకపుష్యరాగమును దంపతులు ధరించిన పుత్రసంతానము కలుగును విద్యవచ్చును పాండిత్య మలవడును సుఖించును ధనముండును వ్యభిచారాది దుష్టదోషములన్నియు తొలగును.

6 వజ్రము దీనికి మహాతేజోవంతుడు, నిగ్రహాను గ్రహసమర్థుడు దాంపత్యకారకుడునైన శుక్రుడు దధిపతి "అవ్వ, వులకము, హీరము, మగమానికము కులిశము కులి శము, గిరిజ్వరము గిరికంఠము వజ్రము, మూలభాయి, నిర్ఘాతము చిదకం" అను పదురెండుపేరులీ వజ్రమునకు కలవు అనంతపురం జిల్లాయందలి "వజ్రకరూరు" ప్రాంతములం దియ్యవి దొరుకుచుండునట!

దీనియందును నాలుగుజాతులు కలవు మల్లెపూవువంటి తెల్లనికాంతితోనుండునది బ్రాహ్మణజాతి చెట్టుచిగురులవంటి లేతయెరుపురంగు కలది క్షత్రియజాతి స్వర్ణ కాంతిలో లేతయెరుపు రంగు కలది వైశ్యజాతి లేతనీలపురంగు కలది శూద్రజాతి

తెల్లవజ్రమునుధరించిన భోగభాగ్యములు కలుగును ఎఱుపువజ్రము జనవశీకరణ మొనరించును స్వల్పముగా పసుపు వర్ణముకలది ధనము నిచ్చును నీలపురంగుకలది దరిద్రము నొసంగును వీటిలో తెల్లనిది అత్యుత్తమమైనట్టిది.

వజ్రధారణమువలన శుక్రుడు సంతసించును కవులకు గాయకుల కిది కన్నతల్లి వంటిది స్త్రీవశీకరణ సభారంజనము జనవశీకరణలు కలుగును పురుషశక్తి వృద్ధియగును స్త్రీల వ్యాధులలో కొన్ని నివారణయగును

ఎనిమిదికోణములుండి ఆరుఅంచులు కలిగి యింద్ర ధనుస్సునందలి రంగులవంటి రంగులతో ప్రకాశించునది పురుష వజ్రము గుండ్రనిఆకారమునందుండి అటుకులరంగు (మలిన మైన తెలుపు)కలిగి యెత్తుగానుండునది స్త్రీవజ్రము వీటియందు పురుషవజ్రము శ్రేష్ఠమైనదిగా రత్నపరీక్షకులు "రత్నపరీక్షదు లందు లిఖించిరి ఇంకను అనేకవిధములైన వజ్రములును కలవు దోషములు లేనిదానిని ధరించుట శుభప్రదము

7 నీలము దీనికి "నీలమణి ఇంద్రనీలము ఇంద్రము అశ్మసారము, జ ర్ఝరము, తృణమణి మాసారము, సుసారము కల్వర్కము, ఔదక" మనంబడు పదిపేరులు కలవు దీని కధి దేవత శనైశ్చరుడు దీనియందును "ఇంద్రనీలము, మహా నీలము, నీలమణి" యను పేరులు కలవియు కలవు

1 ఇంద్రనీలము - పడుచుగత్తియనెత్తిమీద నల్లని జుట్టువంటి రంగుయందుగాని, నెమలికంఠమునందుండిన నీలపు రంగుయందుగాని యుండి మెరయుచుండిన యింద్రనీల మగును దీనిని ధరించిన యింద్రునివలె భోగభాగ్యములు కలవాడై సుఖించును

2 మహానీలము - దీనిని నేలమీదనుంచిన భూమి నీలపు కాంతి గలదగును దీనిని ధరించిన కష్టములు నివృత్తియగును దరిద్రము తొలగును భాగ్య మబ్బును

3 నీలమణి - విష్ణుక్రాంతపుష్పము (దాసానిపువ్వు నీలమునందుండును) రంగువంటి రంగుకలిగి, నీలపుకాంతులతో ప్రకాశించుచుండును దీనిని ధరించినవారియింట మహదైశ్వర్య ముండును

ఇవిగాక "క్షీరగ్రాహీ, తృణగ్రాహీ పుష్యరాగనీలము కెంపునీలము, కెంపునీలము, కాశ్మీరనీలము, కాకినీలము" అను నవియును. యింకను అనేక భేదములుకలవియును కలవు

క్షీరగ్రాహీ దీనిని గోక్షీరములందుంచిన పాలు నీలవర్ణ ముగ కనుపించును

తృణగ్రాహీ దీనిమీద పచ్చగడ్డిపఱకలను, గసగసాల పొట్టును, వడ్లపొట్టునునుంచి నోటితోనూదిన నవి లేవక దాని నంటియేయుండును

తెలుపులో నలుపుకలసిన పుష్యరాగనీలమగును నేరేడు పండువంటి నలుపు. స్వల్పమాత్రము యెరుపుకలసినరంగుయుం డుండిన కెంపునీల మనంబడును పైకి నల్లగావుండి లోపల

యెరుపుకలది కాకిసీల మనబడును తెల్లగాయుండి కాంతిలేనిది కాశ్మీరసీల మగును

నీలమును ధరించిన శని సంతోషించును కష్టములు తొలగించును అపమృత్యుభయ ముండదు, అశాంతులన్నియు నివృత్తియగును విషదోషములు, కొన్నివ్యాధులు శమించును

౮ గోమేధికము దీనికి ప్రభువు రాహువు గోమేధికము గోమూత్రమురంగువలె నుండును రాతిలోపల నీరుండి నటుల కనుపించును తేనెరంగుయుండును తెలుపురంగు యుండును కలవు ఇవి తఱచుగ కంకరరాళ్ళయందు దొరకును నదీప్రవాహములలో కొట్టుకొని వచ్చుచుండును

దీనిని ధరించిన రాహువనుగ్రహము కలుగును సర్పభయ ముండదు శత్రుబాధయు నుండదు రాజాదులు దీనిని ధరించిన పోషించెదరు మానసికవ్యాధులు నశించును ఇంకను శుభఫలము లనేకములు పొందెదరు

౯ వైడూర్యము దీని కధిపతి కేతువు దీనికి "కేతుప్రియము, ఏకసూత్రము, ఖరాబ్దాంకురము, పిల్లికన్ను" అను నామములును కలవు

పగటివేళ సందుసందుండి చూచుచుండెడి పిల్లికన్నువలె నుండును మధ్యభాగమునందు దారముండినటుల కనుపించును సన్ననిరంధ్ర ముండినట్టులును కనుపించును

దీనిని ధరించిన భూతప్రేతపిశాచములు బాధించవు ఈ బాధలు కలవారు ధరించిన స్వస్థచిత్తులగుదురు మంత్రతంత్ర ప్రయోగముల బాధయు నుండదు ప్రసవము కాక బాధపడుచుండు

స్త్రీలు ధరించిన సుఖముగ ప్రసవింతురు నేతియందు దీనినుంచి నేతిని త్రాగించినను జలమునందుముంచి నీటిని త్రాగించినను సుఖముగ ప్రసవింతురు స్త్రీలు దీనినిధరించిన దీర్ఘసౌమంగల్య సౌభాగ్యములు కలవారగుదురు

వైడూర్యమునందు "పులికన్ను నలుపు కృష్ణవైడూర్యము నీలమణి, క్రాసుసూత్రము" లనునవియు కలవు ఇవిగాక, "గోధుమరంగు, తెలుపు, నలుపు బంగారురంగు" లున్నవియు కలవు నల్లదాలని "కృష్ణవైడూర్య" మనియు, బంగారు రంగుకలది "కనకవైడూర్య" మని చెప్పుదురు వీటన్నిటి యందును తొలుత చెప్పిన "పిల్లికన్ను వైడూర్యము" ప్రశస్తమైనది

పిల్లికన్ను వైడూర్యమును ధరించినవారు కేతుగ్రహ ప్రభావము కలవారై ధనవంతుల ప్రాబల్యమును పొందుదురు దరిద్రము పోవును ప్రయత్నించినకార్యములన్నియు శుభాంతము లగుచుండును శత్రువులు మిత్రులుగ మారుదురు నీటి గండము లుండవు బొల్లిమొదలగు వ్యాధులు నివారణయగును జ్యోతిషజీవనులుధరించిన సులభముగ, ప్రమాణయుతముగ జాతకఫలములను చెప్పగలరు

శివానందప్రసాదుడా! నీవడిగిన విషయములన్నియు చెప్పితిని అన్నిమాలలును జపముల కుపయోగించును నవరత్నములను మాలగా చేయించుకొని ధరించిన సర్వసౌభాగ్యములును కలుగును రుద్రాక్ష, తులసిమాలలను స్త్రీలు ధరించుట లేదు. వీరశైవులందలి స్త్రీలును, పండితారాధ్యశైవమతమునందలి స్త్రీలును రుద్రాక్షలను ధరించుచున్నారు వైష్ణవమతము

నందలిస్త్రీలును తులసిమాలలు ధరింతురేమొ తెలియదు స్ఫటిక మాలలు, కుశగ్రంధిమాలలు, పద్మాక్షమాలలు, తామరమాలలు స్త్రీలు ధరించరు. స్వర్ణమాల, శంఖమాల, ముత్యపుమాల పగడమాల స్త్రీలకత్యంతప్రాధాన్యము కలవి ఆదేవిధముగ మణి(కుల)మాల, నవరత్నమాలలును ధరించుట కర్తవ్యము మైనదియె

మణులమాలలతోను, నవరత్నమాలలతోను జపించిన పదివేలగుణములఫలమును పొందును — తృప్తిపడితివా? ఇంకను సందేహప్రశ్నలు కలవా? అనుచు గురువు శిష్యుని చూచినాడు

శివానంద — నమస్కారము గురువుగారు! ఇంకొక్కటిమాత్రము మిగిలినది తులసీకథ చెప్పుచు "తులసి గండకీనదిగా మారినదనియు, నందు విష్ణుభగవానుడు సాలగ్రామపర్వతముగ ఆవిర్భవించెననియు, నందుండి పూజార్హము లైన నట్టి సాలగ్రామములు పుట్టుచున్నవనియు చెప్పి యుంటిరి ఆ సాలగ్రామముల లక్షణములెట్టివి? ఏలక్షణములున్నవి యేపేరులకుం దగియుండును? ఈ విషయములన్నియు వినుపింప ప్రార్థించుచున్నాను

గురువు శిష్యునివేడికో అంగీకరించినాడు. సాలగ్రామ ములచరిత్ర చెప్పుట కుపక్రమించినాడు

## సాలగ్రామముల చరిత్ర

శివానందా! వినుము నీవు నన్నడిగిన విధముగ పూర్వమునందు బ్రహ్మ శ్రీపతిని సాలగ్రామములనుగూర్చి

అడిగినాడు నారాయణుడు సమాధాన మిచ్చినాడు ఈ విషయ మంతయు పాంచరాత్ర వైష్ణవులకు ప్రమాణగ్రంథమైన పురుషోత్తమసంహితయందు దిరువదియొనిమిదవ అధ్యాయమునందు కలదు దానినే వినుపింతును

చతుర్ముఖుం డొక్కనాడు దేవదేవుడైన విష్ణువును సమీపించి——

"భగవన్ దేవదేవేశ సర్వసంపత్కార ప్రభో,
సాలగ్రామాది మూర్తీనాం లక్షణం వక్తు మర్హసి,"

భగవంతుడా ! దేవదేవా ! సర్వసంపదలొసంగు ప్రభూ ! సాలగ్రామాదిమూర్తుల లక్షణములను చెప్పుము అందుకు తగినవాడ" వని ప్రార్థించెను

వాణీధవునివాక్యమును వినిన రమాధవుడు సాలగ్రామాది మూర్తులభేదముల నన్నిటిని చెప్ప మొదలిడినాడు.

బ్రహ్మ ! సాలగ్రామముల లక్షణములను చెప్పుచున్నాను, వినుము సాలగ్రామమందు నిరంతరము శ్రీ నివసించియుండును ఎవ్వరు సాలగ్రామమును సర్వద అర్చించుచుందురో వారిపాపములన్నియు నశించును సందియములేదు అందుచేత ముముక్షువులు సాలగ్రామమునందు విష్ణువును ప్రతిష్ఠించి సర్వదా పూజించుచుందురు కావున నట్టి సాలగ్రామలక్షణములను శ్రద్ధగా వినుము. ఏయేలక్షణములుండిన యేమూర్తి అగును ? ఏమూర్తికి యేలక్షణము లుండును ? సాలగ్రామము పూజార్హమైన దగును ? అను ప్రశ్నలకన్నిటికిని సమాధానములు చెప్పెదను. కుమారా ! సావధానుడవై వినుము

౧. పృష్ఠభాగ మున్నతముగనుండి తెల్లనిశంఖము, రెండుచక్రములు కలిగియుండిన "కూర్మ"మగును దీనిని పూజించిన సర్వవాంఛితములు తీరును

౨. రెండుబిందువులును, శంఖచక్రములును, దక్షిణ వామభాగములందు దీర్ఘముగ వర్తిమును, అయిదువలయము (చుట్టు)లుకలిగియుండిన మందరపర్వతమును ధరించిన "కూర్మమూర్తి"యని చెప్పబడును దీనిని పూజించిన కోరికలు తీరుచుండును

౩. స్వర్ణకాంతిగలిగి గుండ్రముగ (కోడిగ్రుడ్డువలె) గాని, పుష్పమువలెగాని యుండి, రెండువైపులందును చక్రము లుండిన "ఆదికూర్మ"మగును ఇదియును కోరికలు తీర్చును

౪. వర్తులముగ గోనలియాకారమువలెనుండి, దీర్ఘ ద్వారముండి, రెండు చక్రములు కలిగి, ప్రక్కభాగమందు తాపేటిరూపముతోనుండి [illegible] కలిగి నీలము లోహితము వర్ణములుండిన "కూర్మమూర్తి"యని చెప్పబడును పుత్ర పౌత్రాభివృద్ధికలుగును క్షత్రియులు దీనినిపూజించిన శత్రునాశనము జరుగును

౫. ఇంద్రనీలమునంటి కాంతిగలిగి, స్థూలరూపము, శ్రీరేఖయు దక్షిణభాగమున చక్రమును, సమున్నప్రదేశమైన యెమురుతొమ్మమీద వనమాలయు నుండినదానిని "లక్ష్మీవరాహ"మనంబడును ఇది శుభము లొసంగును

౬. అతసీపుష్పమువంటి రంగుగాని లేక నీలోత్పల పుష్పమువంటి రంగుగాని యుండి, లోతువెడల్పుగల ద్వారము తోను, పృష్ఠము, యెడమభాగమును వరాహరూపముకలిగి,

పృష్ఠభాగమున రేఖయుండి ముఖమును పాదములును వాలముతో చేరియున్నను, చేరకయున్నను, వెనుకభాగమందు నుభయపార్శ్వములందును కౌస్తుభరేఖతో చేరియుండిన "భూవరాహ" మగును దీనిని పూజించిన రాజ్యలక్ష్మి సంప్రాప్తించును

౭ రత్నకాంతితో సమానమైన కాంతికలిగిగాని, లేక నలుపురంగుతోగాని యుండి సన్నముగ పొడవైన ద్వారముండి ద్వారమధ్యమునందు రెండు చక్రములు, వనమాలరేఖయు నుండిన "వరాహమూర్తిగ" గుర్తించిరి ఈసాలగ్రామమును పూజించిన పుత్రులు పౌత్రులు నుందురు ధనమంతును జ్ఞానము లభ్యపడును

౮ ఎడమభాగమున బిందువును చక్రము నుండి నల్లని రంగుయందుండిన "లక్ష్మీనృసింహ" మగును ఇది భుక్తి ముక్తి లొసంగును

౯ బంగారుకాంతికలిగి, కపిలవర్ణముండి, పెద్దనోరుండి రెండుచక్రములుండిన "వీరలక్ష్మీనృసింహ" మనంబడును దీనిని బ్రహ్మచారులుమాత్రమే పూజించవలయును.

౧౦ శంఖమువలెనుండి, బిందువును, అర్ధమాలయును, కరాళవదనము, దీనియందు పండ్లును, పెద్ద చక్రమును, దీర్ఘ కేశములు కలిగియుండిన "విదారణనారసింహ" మగును దీనిని బ్రహ్మచారులే పూజించవలయును ఇతరులు పూజించరాదు

౧౧ వదనలోపలిభాగమున చక్రమును బృహద్రూపమును, దక్షిణ(కుడి)భాగమునం దెత్తైనశిరము నుండిన "జ్వాలావిదారణనారసింహ" మనంబడును గృహస్థులు, బ్రహ్మచర్య

ముసు కాపాడుకొనలేనివారు దీనిని పూజించరాదు వ్యతిరేకించి పూజించిన నశింతురు.

౧౨ కపిలవర్ణము, పెద్దదైనబిలము, తీక్ష్ణరూపము, లోతు వెడల్పు దంతము లుండిన కరాళవదనము కలిగియున్నట్టిదిగాని లేక నాలుగుముఖములుండి గర్భమునందు చాపాకృతి గలిగి చక్రముండి, చక్రమున కొకవైపున దంష్ట్రిలుండినట్టిదిగాని "నృసింహ" మగును దీనిని క్రమసన్యాసదీక్షనొందిన యతులు మాత్రమే పూజించవలెను

౧౩ బలిష్ఠములైన రెండుచక్రములును, మధ్యభాగమునందు గురిగింజవంటి యెర్రనిరంగగును. అపసవ్యచక్రమును కలిగియుండిన "కపిలనారసింహ" మనబడును దీనిని పూజించిన యుద్ధములందు జయము కలుగును మోక్షమును కలుగును

౧౪ అనేకముఖములుండి యేడుచక్రములు కలిగి, ఆభరణరేఖ లంతటను కలిగియుండిన "సర్వతోముఖనారసింహ" మగును దీనినర్చించిన మోక్షము కలుగును

౧౫ తెరచియుండినట్లుండిన నోరు, యెడమభాగమున చక్రమును కలిగి కపిలవర్ణముతో గుండ్రముగానుండిన "ఛిత్రాఖ్యనారసింహ" మనబడును ఇది గృహస్థులకు భయమును కలిగించును.

౧౬ అనేకద్వారములతోను బంగారంగులతోనునుండి, పదమూడుచక్రములును పెద్దపొట్ట యుండినట్టిది "పాతాళనృసింహ" మగును ఇందుచెప్పినలక్షణములుగాక యితర లక్షణములున్నదియు "పాతాళనృసింహ" మగును జ్ఞానభిక్షువుల కిది అమృతప్రాయమువంటిది మోక్షము నిచ్చును

౧౭ చిన్నద్వారము చిన్నచక్రము పెద్దపొట్ట కలిగిన దానిని "దధినారసింహ" మని యందురు. దీనిని వనములం దుండువారు హెచ్చుగా పూజించుచుందురు

౧౮ అనేకరంధ్రములు, భిన్నమైన వక్త్రము, స్వర్ణ కాంతి, రెండుచక్రములు కలిగినదానిని "రక్షసనారసింహ" మని చెప్పుదురు ఈసాలగ్రామ మేగృహమునందుండునో ఆ గృహము తగులబడును

౧౯ అకుపచ్చరంగు, యెత్తుగానుండిన శిరము, రెండు చక్రములుండిన ముఖము కలిగియుండిన "విద్యుజ్జిహ్వా నార సింహ" మగును దీనినిపూజించిన ధనవంతుడు దరిద్రుడగును గృహ మేధులకియ్యది నిషిద్ధము

౨౦ ముఖమునకు రెండువైపులందును,పృష్ఠముమీదను మూడుచక్రము లుండినదానిని "అఘోముఖనృసింహ"మందురు దీనిని పూజించినవారి కన్నివిధములైన బంధములనుండి విముక్తి కలుగును

౨౧ స్వల్పమైన రంధ్రముండి, వనమాల కలిగియుండిన "బాలనృసింహ" మగును దీనినిపూజించిన సంసారబంధము నుండి విమోచనము కలిగి మోక్షము చేకూరును

౨౨ పొడవైన రూపము, పొడవైనచక్రము, వరాహ ముఖము కలిగియుండిన "విభీషణనారసింహ" మగును. ఇది మానవులకు దుఃఖమును కలిగించును

౨౩ గుండ్రనిముఖమును కలిగి పొట్టిదిగా నుండినది "వామన" రూప మగును.

౨౨. అతసీపుష్పము (నల్లని) వంటిరంగు, బిందువు (చుక్క)లు, రెండుచక్రములు, ముఖమునందు తెల్లని బిందువు నుండినదానిని "దధివామనమూర్తి" యనిరి దీనిని పూజించిన గో భూ ధాన్య ధనములు విశేషముగ లభ్యమగును

౨౩. సన్నముగను గుండ్రముగను స్పష్టమైనచక్రముతోను, హ్రస్వమై యెత్తుగా పొడవుగా నుండిన ముఖమును, ముఖముపైద స్పష్టముగా కనుపించు నిర్మలములైన రేఖలును, యెత్తుగానుండిన బొడ్డును, ఉన్నతములైన స్తనములును, చక్రమును, చక్రమున కిరుపార్శ్వములందును కేసరములును కలిగియుండినదానిని "అభీష్టవామన" మనిరి దీనిని పూజించిన అన్నములేనివారి కన్నము దొరకును భూలాభము కలుగును.

౨౪. అతిపొట్టిదిగానుండి, మధ్యయందు చక్రముండి, చక్రము కంచువలె ప్రకాశించుచుండుదానిని "వామనమూర్తి" యనిరి ఇది మానవుల కోరిక లన్నిటిని తీర్చును

౨౫. అతసీపుష్పము (నలుపు)వలెనుండి యెత్తైనశిరము స్వల్పముగ కనిపించునట్టి చక్రము నుండిన "బాలవామన" మందురు దీనినిపూజించిన యిష్టసిద్ధి కలుగును

౨౬. మేఘమువంటి నీలరంగును, గుండ్రని రూపమును. వనమాలను ధరించినరీతిగ చిహ్నమును, స్వల్పరంధ్రమును. పెద్దపొట్టయును కలిగి చక్రముతోనుండినదానిని "బృహత్కుక్షివామన" మనిరి ఇది శుభములనే యిచ్చును

౨౭. ఎఱుపు పసుపు నలుపు రంగులతో పొడవగు ఆకారము, పెద్దదైన బిలము(గుహవలెనుండెడి ద్వారము). బిలము

నకు కుడివైపునగాని యెడమవైపునగాని గోడయందు చక్రమును, చక్రమునందు బిందువుగాని, గంద్రగొడ్డలివంటి ఆకృతిగాని యుండి, వెనుకభాగమునందైనను ప్రక్కలయందైనను దంష్ట్రాకృతిగల రేఖతో నుండినదానిని "పరశురామ" మని చెప్పిరి ఇది భూమిని పాలించు క్షత్రియులకుమాత్రమే పూజార్హమైనది

౨౦ పృష్ఠభాగమునందు గంద్రగొడ్డలిరేఖయు, చక్రము కలిగియుండిన "శాంత పరశురామ" మగును. దీనిని శాంతికాముకు లర్చింతురు

౨౧ ధనుర్బాణములు, తూణీరకుండలములు, సూక్ష్మమైన పృక్స్రువాది రేఖలును, కేసరములుండిన చక్రమును కలిగియుండిన లక్ష్మీదేవితోగూడియుండిన "వీరరామ" మగును.

౨౨ ఒక నోరును, దీనియందు నాలుగు చక్రములును, ధనుపు, బాణము, తూణీరము, ఛత్రము, చామరము, ధ్వజము వనమాల మొదలగు రేఖలతోనుండిన "సీతారామ" మగును

౨౩ రెండు ద్వారములును, వీటియందు నాలుగుచక్రములును, వామభాగమునందు మరియొకచక్రమును కలిగి, బాణతూణీరాదిరేఖలతోనుండిన "పంచచక్రసీతారామ" మగును. దీనిని నిత్యము పూజించుచుండిన సర్వసౌభాగ్యములు సమకూరును

౨౪ మూడు ద్వారములుండి, ద్వారములం దిరుప్రక్కలందును ఆరుచక్రములును, ధనుర్బాణములు, నూపురములును, నలుపువర్ణమును యెత్తయినపృష్ఠమును, పెద్దనేరేడుపండువంటి

ప్రమాణముతోను సీతాబిలముతోను గూడియుండిన "షట్చక్ర సీతారామ' మగును ఇంకను దీనిని "తారకబ్రహ్మ" మనియు నందురు దీనిని పూజించిన యీలోకసుఖములన్నియు నబ్బును పరలోకమునందును సుఖములు కలుగును

౨౫. షట్చక్రసీతారామమునకుంజెప్పిన లక్షణములన్నియు కలిగి, యెనిమిదచక్రములతో గూడియుండిన "మహాసీతారామ" మగును ఇది శ్రేష్ఠమైనట్టిది దొరకుట దుర్లభము దీని నర్చించిన మూడులోకములందును లభ్యపడని "మహోత్తమ"మైనట్టిది లభ్యపడును

౨౬ ఒకచక్రము శ్యామల (తెలసీలము) వర్ణము, కోడిగ్రుడ్డువంటి ఆకారము, వున్నతమైన పృష్ఠము, ఒకబిలము దీనికిరువైపులందును రేఖలును, పార్శ్వమునందుగాని పృష్ఠభాగమునందుగాని ధనువువంటి రేఖ యుండిన "దశకంఠాంతక రామ" మగును

౨౭ రెండుచక్రములును, పార్శ్వములందు ధనుర్బాణరేఖలును, పృష్ఠభాగమునం దైదురేఖలును కలిగియుండినదానిని "బాలరామ" మనిరి సంతానహీనులు దీనిని పూజించిన పుత్ర సంతానము కలుగును సందేహ మిసుమంతయును లేదు

౨౮ దివ్యమైనట్టి బాణములు, చాపతూణీరములు, కరాళవదనము, రక్తబిందువుతోనుండిన చక్రము, వీటితో గూడినట్టి దానిని "విజయరామ" మనిరి ఇది సర్వసంపద లిచ్చును అపజయ మెన్నడును కలుగదు

౨౯ శిరమునందు వనమాలయుండి, ధనుర్బాణములు, నుభయపార్శ్వములందు శంఖము, రెండుచక్రములు కలిగియుం

డిన "హృష్టరామ" మగును. ఇద్దాని నర్చించిన భుక్తిముక్తులు కలుగును

౪౦ కొలది పొడవునందు గుండ్రని ఆకారము, నీల వర్ణము, బాణము తూణీరము చాపములవంటి రేఖలతో నొప్పి యుండిన "కోదండరామ" మగును పూజించుట కిది శుభప్రద మైనది

౪౧ శ్యామవర్ణము కలిగి, ముఖమునం దొరచక్ర ముండినయెడల "కవిత్వరామ" మగును దీనిని పూజించువారికి కవిత్వమబ్బును

౪౨ చిక్కని నలుపురంగు కలిగి, చిన్నదిగానుండి సుందర మైనట్టి చక్రముతో శోభించుదానిని "యదుకృష్ణమూర్తి" యందురు ఇది సంపదను, తుష్టిని, పుష్టిని ప్రసాదించును

౪౨ పసుపు నలుపురంగుల మిశ్రమరంగుతో పలుచ నైన ఆకృతితోను, పార్శ్వమందు చక్రము, ద్వారసురీతిగ నుండెడు నాభియు, పృష్ఠము కూర్మాకారమువలెనుండినదానిని "శ్రీకృష్ణమూర్తిగ" చెప్పిరి ఈ మూర్తిని పూజించిన పాప ములు నశించును ధర్మ మభివృద్ధిచెందును.

౪౩ శ్రీవత్సవనమాలారేఖలుండి, చక్రము కలిగి కర్రు వంటి కొమ్మును, ముఖమునకు ప్రక్కభాగమునందు వేణువును కలిగియుండిన "గోపాలకృష్ణమూర్తి" యగును ఈ గోపాల మూర్తిని పూజించిన గో భూ ధన ధాన్యము లవ్యారిగ లభ్య మగును

౪౪ శిరస్సునందు రెండుచక్రములును, వేణువు శ్రీవత్సము, వనమాల చిహ్నములును, కుండలములును కలిగి యుండినరేఖలును, పార్శ్వమునందు కల్పవృక్షరేఖయును కలిగి యుండిన "మదనగోపాల"మగును ఈమదనగోపాలసాలగ్రామము నర్చించువారికి పుత్రులు పౌత్రులు నుందురు తరుగనంతటి సంపదయు, లోకవశ్యమును కలుగును

౪౫ పొడవైనఆకారము, నల్లనిరంగు, అర్ధచంద్రాకృతిగానుండెడి ముఖము, ఒక చక్రమును కలిగియుండిన "సంతానగోపాల"మగును సంతానహీనులు దీనిని పూజించుచుండిన సంతానలాభము నొందగలరు

౪౬ ఎత్తయినశిరమునందు నలుపువర్ణము, వంగియుండిన అధోభాగమునందు మూడుబిందువులును రెండుచక్రములు ను పొడవైనముఖమును కలిగియుండినదాని "బాలకృష్ణ" యనిరి ఇది అష్టైశ్వర్యము లొసంగును

౪౭ ద్వారమును సమమైన చక్రమును, నల్లనివర్ణమును కలిగియుండిన "శ్రీకృష్ణమూర్తి" యగును ఇది సౌఖ్యము లిచ్చును

౪౮ చక్రములులేక లోపలిభాగమంతయు డొల్లగానుండినది "బుద్ధమూర్తి"యగును ఇది మోక్ష మొసంగును

౪౯ చిక్కని రక్తవర్ణమును, చిన్న బిలమును, స్పష్టముగా కనుపించు చక్రమును బిలముపైనను వెనుకను ఖడ్గరేఖతోగూడి స్థిరాసనముందుండునది "కలికిమూర్తి"యనిరి ఇది పాపములను నశింపుచేయును. అధర్మమాచరించునట్టి మ్లేచ్ఛులను, మ్లేచ్ఛసదృశులను నాశన మొనరించును.

౨౦ పొడవైన రూపము, శ్యామలవర్ణము వనమాలతో గూడినది "మత్స్యమూర్తి" యగును దీనిని పూజించిన పుత్రపౌత్రాభివృద్ధియగును సర్వసంసిద్ధియు కలుగును

౨౧ మూడురేఖలుండిన ద్వారమును, పృష్ఠమునందు పద్మమును, రెండుచక్రములతో చతుష్కోణాకృతిగలిగినదానిని "కేశవమూర్తి"యని చెప్పిరి ఇది సౌభాగ్య మిచ్చును

౨౨ శ్యామలవర్ణముతో నుండెడి ముఖమును, ఎత్తుగా నుండెడి నాభిచక్రమును, దీర్ఘములైన మూడురేఖలును పైభాగమునందు బిలమును కలిగియుండిన "శ్యామనారాయణ" యగును ఇది భుక్తిముక్తు లొసంగును

౨౩ గుండ్రనిదిగానుండునదియు నాలుగుచక్రములును ఒక్కముఖమును, శ్యామలవర్ణమును, ధ్వజ వజ్ర అంకుశ [illegible] మాలాది చిహ్నములును, బిందువులును కలిగి, పొట్టిదియు పొడుగుదియు కాని రూపము కలదానిని "లక్ష్మీనారాయణ" అనిరి దీనిని చూచినంతమాత్రముననే సర్వాభీష్టములును నెరవేరును

౨౪ తేనెవంటి రంగును నల్లనిదిగ మధ్యయందుండెడు చక్రమును కలిగినట్టిది "మాధవమూర్తి"యగును దీనిని యతులు పూజించిన మోక్షమబ్బును

౨౫ అయిదుముఖములును, పదిచక్రములును, కృష్ణవర్ణమును కలిగి చిన్నదియు పెద్దదియును కాక మధ్యమపరిమాణమునందుండునట్టిది "గోవిందమూర్తి"యగును ఇది సమస్త వాంఛితము లీడేర్చును